# ...గత్కథ

(హెచ్. జి. వెల్సుగారి
గ్రంథమున కనువాదము.)

డాక్టర్ సర్. ఎస్. రాధాకృష్ణగారి
ఉపోద్ఘాతముతో.

కొమాండూరి శఠకోపాచార్యులు,
ఎం. ఏ., బి. ఎల్.

ప్రకాశకుఁడు: కా. శఠకోపాచార్యులు.



మొదటికూర్పు 1,000 ప్రతులు.

**1935**

వెల రు. 3.

కాకినాడముద్రాక్షరశాల,
కాకినాడ.

2

# విషయసూచిక.

అధ్యాయము. పుట.

---

# పటముల సూచిక.

---

## సంజ్ఞలసూచిక.

ఈ. ఉ. ఈశావాస్యోపనిషత్తు
ఋ. సం. ఋగ్వేదసంహిత
ఐ. ఉ. ఐతరేయోపనిషత్తు
క. ఉ. కఠోపనిషత్తు
కే. ఉ. కేనోపనిషత్తు
ఛాం. ఉ. ఛాందోగ్యోపనిషత్తు
తై. ఉ. తైత్తిరీయోపనిషత్తు
ధ. ప. ధమ్మపదం
బృ. ఉ. బృహదారణ్యకోపనిషత్తు
భ. గీ. భగవద్గీత
మ. స్మృ. మనుస్మృతి
శ్వే. ఉ శ్వేతాశ్వతరో పనిషత్తు

I

## FOREWORD.

---

Mr. K. Satakopachary, M. A., B. L., of Cocanada is to be heartily congratulated on his excellent Telugu translation of H. G. Wells' **History of the World** with copious notes and a valuable introduction, which are intended to make the work interesting to the Telugu reader.

In modern democracies where the capacity for reading has far outrun the capacity for thinking, every one who endeavours to 'educate our masters' deserves our sympathy. Mr. H. G. Wells is one of the greatest teachers of our times. His book on the **History of the World** was for years one of the best sellers. He has written it not as a scholar; not as an Englishman with faith in the mission of his own country to give a lead to the world but as a humanist, a citizen of the world delighting in the varied manifestations of the human mind and able to discover the common stuff underlying the diversity of people. At a time when nations are organising immorality as an instrument of political power, and behaving as victims of the herd instinct and traitors to humanity, it is good to be reminded of our membership of the human community and obligations

to the human race. Mr. Wells traces the general transformation of the structure of human society which, with many variations of method to suit time and place, is now trying to substitute interdependence for independence in political and economic, cultural and religious, relations.

History is significant change. It is the task of the historian to discern the significance, the meaning, the pressure of eternity on the events of time. For Wells, the meaning of history is the achievement of a world state, an international community, and his work is a contribution to the development of a world-conscience, a world-soul.

It is written in clear ringing prose which bears on every page evidence of the author's learning and imaginative sensibility, and endless command over facts and opinions. The Telugu public are immensely indebted to Mr. K. satakopachary for giving them this great work.

**S. Radhakrishnan.**

# ఉపోద్ఘాతము.

హెచ్. జి. వెల్సుగారి ప్రపంచ చరిత్రకు ఆంధ్రమున ఉత్కృష్టానువాదమును, విపులమగు వివరణలను, అమూల్యమగు భూమికను జేర్చి, ఆంధ్రపాఠకులకు హర్షకరముగ, రచించిన కొ. శఠకోపాచార్యులు ఎం. ఎ., బి. యల్ గారు హృదయపూర్వకముగ నభినందనీయులు.

ఆధునిక ప్రజాపరిపాలనములందు, గ్రంథపఠనమలవడినంత విరివిగా ఆలోచనశక్తి వ్యాపించుటలేదు. అట్టితరి మన ప్రజాపాలకులకు సద్బోధజేయ యత్నించు వారియెడ సానుభూతి జూపనగు. నేటిమహావిజ్ఞానప్రదాతలందో వెల్సుగారొకరు. వారి ప్రపంచచరిత్ర చాలయేండ్ల నుండియు మిక్కుటముగ అమ్మిన గ్రంథములలో నొకటి. దానినాయన వ్రాసినది పాండిత్యప్రదర్శనార్థముకాదు; తన ఆంగ్లదేశమే ప్రపంచమున కంతటికిని మార్గదర్శకమని సూచించుటకును కాదు; విశ్వజనీనభావముతో, మానవచిత్తవృత్తిలోని వికాసభేదముల కానందించుచు, ఆయా వివిధజాతుల సామాన్యసత్వమును గనిపెట్టగల జగత్ కుటుంబిగనే దాని నాయన వ్రాసెను. ఆయాజాతీయులు అవినీతిని తమ రాజకీయాధికారములకు సాధనముగా నేర్పర్చుచు, గతానుగతికసూత్రమున మ్రగ్గి, మానవధర్మవిద్రోహులై చరించుచున్న యీ కాలమున, మానవసంఘమందు

మనసభ్యతను మానవజాతియెడ మనకుగల బాధ్యతలను జ్ఞప్తికి తెచ్చుట యుచితము. దేశకాలోచితముగ వివిధపద్ధతులు మారుచు, రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక, ధార్మిక, సంబంధములందు ప్రత్యేకత్వమంతరించి, దానికిబదులు పరస్పరాధారమునే స్థాపించుటకు మానవసంఘ మిప్పుడు యత్నించుచున్నది. సంఘమున గల్గు అట్టి సాధారణ పరిణామము నెల్ల వెల్సుగారు బాగుగ వివరించిరి.

విశిష్టపరిణామమే ఇతిహాసము. తద్విశేషమును, తదర్థమును, కాలపరిమాణమందు శాశ్వతత్వచిహ్నమును, గమనించుటయే చారిత్రకుని కర్తవ్యము. ప్రపంచమంతట నొకే ప్రజారాజ్యనిర్మాణమును, అంతర్జాతీయ సంఘస్థాపనయు, ఇతిహాసభావమని వెల్సుగారియూహ. విశ్వజనీన భావమును, జగదాత్మకత్వమును, వ్యాప్తినొందించుటకాయన గ్రంథము మిగుల సహకారి యైనది.

ఈ గ్రంథము స్వచ్ఛమగు ఉజ్వలశైలిని వ్రాయబడినది. గ్రంథకర్త పాండిత్యము, భావవైశద్యము, విషయములయెడ, అభిప్రాయములయెడ వీరికిగల అనంతసామర్థ్యమును, ఇందలి ప్రతిపుటయు వెల్లడించుచున్నది. ఇట్టి యుద్గ్రంథమును దమకు లభింపజేసినందుకు శఠకోపాచార్యులుగారికి ఆంధ్రులెల్లరు మిక్కిలి కృతజ్ఞులు.

సర్వేపల్లి రాధాకృష్ణ.

# అనువాదకుని భూమిక.

---

శ్లో॥ "పృథ్వీ రేణురణుః, పయాంసికణికాః, ఫల్గుస్ఫులింగో లఘుః । తేజో, నిశ్వసనంమరుత్, తనుతరం, రంధ్రం సుసూక్ష్మంనభః, । క్షుద్రారుద్రపితామహ ప్రభృత యః, కీటాస్సమస్తాస్సురాః, । దృష్టేయత్ర, సతావకో విజయతే భూమావధూతావధిః.।"

("నీమహావిభూతి అవధిలేనిది. దానితో బోల్చుచో భూమియంతయు చిన్న నలుసువంటిది; ఈసింధువులు తుంపరలు; ప్రచండతేజము చిన్నమిణుగురుకాంతి; వాయుమండలమొక నిట్టూర్పు; అంతరిక్షము చిన్నరంధ్రము...")

క్రీ. పూ. 7 వ శతాబ్దిని తిరువాన్కూరు పాలకుడైన కులశేఖరరాజర్షి ఈశ్వరు నుద్దేశించి భూ జల కాంతి మరుదాకాశాదుల నిట్లు త్రేవక్షించెను. ఇది కవిచమత్కృతిమాత్రమేయనియు, ముకుంద మహత్వవర్ణనకై కవిప్రియమగు అతిశయోక్తినే ఇందు వాడెననియు, కొందరందురు; కాని అది సరికాదు. ఆకాశమున రాత్రివేళ

మినుకు మినుకుమను నక్షత్రములు యథార్థముగా మన భూమికన్న లక్షలకొలది రెట్లు పెద్దవి. (అందుగొన్ని మన సూర్యునికన్నను పెద్దవి, ఎక్కువ తేజోవంతములు.) అవి అన్నియు పరస్పర సంఘర్షములేకుండ మహావిశ్వాంతరమున కోట్లకొలది మైళ్ల ఎడమున, ఏదో మహాశక్తిచే నియమముగ అమేయకీతి నాకర్షితములై, తమతమ కక్షులందు విపరీతవేగముతో బోవుచున్నవని, జ్యోతిశ్శాస్త్రజ్ఞు లిటీవల పరిశోధనలచే గనిపెట్టిరి; అవి సూర్యునికన్న నింకను కోట్లకొలదిమైళ్ళదూరమందున్నవి. ఇట్లు మనచర్మచక్షువులకగపడునవిగాక, ఇంకను లక్షలకొలది మహాగోళములు అతిబలీయమగు దూరదర్శని యంత్రముల సాయమున గోచరించును; ఈమహాగోళములుగాక తేజోయుతమగు పల్చనిపదార్థసంచయములు, ధూమకేతువులు, మున్నగు విచిత్రరూపవస్తువు లప్పుడప్పుడాకాశమున గానవచ్చును; ప్రతిరాత్రియు మెరయుచు తటాలున పోవుచుండు ఉల్కలకు లెక్కయేలేదు. గొప్ప దూరదర్శనియంత్రములకును అందక ఆగోళముల కింకను చాల దూరమందు గూడననేక మహాలోకములున్నట్లు, కొందరు ధీమంతులూహించుచున్నారు* అట్టిచో పైశ్లోకపువర్ణన కేవల స్వభావోక్తియే!

---

* ముందుండు 5, 6, వ పుటల జూడుడు.

ఇట్టి మహావిశ్వములో, ఇతరదూరగ్రహముల మాట యటుండ, మనకతిసమీపములగు చంద్రాంగారకుల స్థితియు వైజ్ఞానికుల కింకను స్పష్టముగ దెలియదు. విజ్ఞానసహాయమున సృష్టివైచిత్రి అందలి రహస్యములు మనకు గోచరించుకొలదిని, విశ్వవిభూతి, ఈశమహత్వము, మన అల్పజ్ఞత, మతగ్రంథములందు వర్ణింపబడిన వానికన్న ఎక్కువబాగుగ మనకు తెలియుచున్నవి.

మహావిశ్వమెంత విశాలమో సరిగా తెలియనట్లే, మన భూమిలో అతిసూక్ష్మమగు ప్రతిపరమాణువు నిర్మాణ రహస్యము, అందిమిడియున్న ఎలక్ట్రను ప్రోటను మున్నగు వస్తువుల స్వరూపము, వాని నిప్పటికిని దుర్భేద్యముగ బంధించిన శక్తితత్వమును, వైజ్ఞానికుల కింకను పూర్తిగ తెలియదు. విశ్వమంతటను, ప్రతిపరమాణు లేశములో గూడ, ఏదోయద్భుతశక్తివ్యాపించియున్నట్లు మాత్రమిటీవలి పరిశోధనలచే స్పష్టమైనది.

మనభూమి పూర్వస్థితియు ఇట్లేయున్నది; అది గూఢము, అతివిచిత్రము. మనభూమి ఎప్పుడు, ఎట్లు, ఏర్పడెను? అందు జీవకోటి యెట్లారంభించి, వికసించెను? ఏయే యుగములందేయేజాతి ప్రాణులుండెను? వీనిక్రమపరిణామ

మున నరజాతి ఎప్పుడు జనించి ఎట్టిమార్పులనొందెను? ఆయావివిధమతములు, జాతిభేదములు, భిన్ననాగరికతలు, భిన్నభాషాదులు, ఎప్పుడు ఎట్లేర్పడెను? ఈవ్యత్యాసముల భావమేమి? ఈసమస్యలు విజ్ఞానతత్వజ్ఞుల సంతత పరిశోధన వలన తేటపడి, కొంత తెలియుచున్నవి. ఇప్పటికి నిర్ధారణ అయిన మన జగత్తు పూర్వకథ నొకరీతిగా వైజ్ఞానికులు చిత్రించినారు. ఇంకను తీవ్రపరిశోధనలు జరిగి, చాలప్రకృతి రహస్యములు వివరములు ముందు తెలియవలసియున్నవి.

మన ప్రపంచ మారువేలయేండ్లక్రిందనే హఠాత్తుగ ఏర్పడెనని పాశ్చాత్యులు పూర్వము తలచిరి; భారతీయు లెన్నడు నట్లు భావించలేదు. మనప్రాచీనుల ప్రకారము కాల మనాద్యనంతము. ఇప్పటికి లక్షలకొలది యేండ్ల పరిమితిగల అనేక మహాయుగములు, మన్వంతరములు, కల్పములుగూడ, గడచినవి. స్థలవిషయమునను మనప్రాచీనులు మనమున్న మహాఖండము (జంబూద్వీపము) నెరింగిరి; ఇప్పటి భారతదేశమునకు చుట్టుపట్లనున్న గాంధారాదులు, హిమాలయప్రాంతములు, బర్మా ఆగ్నేయపార్శ్వద్వీపములు, ఇత్యాదులప్పటి భారతవర్షమున చేరియుండెనని తోచును. ప్రతివైదికకార్యారంభమందును సంకల్పభాగమున ప్రస్తుతస్థలకాలనిర్దేశముచేయుట మనలో చిరకాలాను

 

గతమగు ఆచారము * అందుచే లోకపు దేశకాలవైశా ల్యము సృష్టిమహత్వముగూడ మనకు జ్ఞప్తికి దేబడును.

అనేకయుగముల క్రింద అవ్యక్తజీవములగు జడములనుండి ప్రాణులు అత్యల్పముగను తరువాత మత్స్యాది జలచరములుగను మొదలిడెను; అంత నొక్కొక యుగము గడచి, కొత్తపరిస్థితులు కలిగి, ఉభయచరములగు కూర్మ సర్పాదులు, అంతట పిండజములగు సత్వనులు, పిదప మహామృగములు, ఆపైన కొంతమృగముల కొంత నరులబోలు జాతులు, తుదకు నరులు, కలిగిరి. నరులు మొదట సుమారు మూఢజాతులుగనై, సంచారులై, వ్యాపించిరి; ముందుశిలాలోహోపకరణముల వాడుకను, పిదప వేటను, విల్లంబుల వాడుకను, క్రమముగా వ్యవసాయాదులను, నేర్చిరి; అటుపిమ్మటనే జనులలో మంచిజ్ఞానముకలిగెను: ఇదియంతయు ప్రకృతిశాస్త్రజ్ఞులు చేసిన సిద్ధాంతము. ఈజీవవికాసపు ఆయాయుగములకు వైజ్ఞానికులు వేరువేరు పేరుల నిచ్చియున్నారు. ఆయా యుగముల పట్టీని, అప్పటి క్రమపరిణామము తెల్పు జీవ పరిణామవృక్షమును, ఇందు గనుపర్చితిని.

---

* "...శ్వేతవరాహకల్పే, వైవస్వతమన్వంతరే, అష్టావింశతి తమే, కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే. భారతవర్షే, భరతఖండే, శకాబ్దే మేరోర్దక్షిణదిగ్భాగే........"

# ఆయా యుగముల పట్టిక.

## 200 కోట్లు యేండ్లు భూకాలము.

| ఎన్ని యేండ్లక్రింద | యుగము | అప్పటి భూలక్షణము ముఖ్యజీవులు. |
|---|---|---|
| 200-130 కోట్లు | ఆరంభయుగము | (భూగోళము జలము ఏర్పడెను. |
| 130-80 కోట్లు | అజీవయుగము | (అప్పటికి ప్రాణులు లేవేమో ! |
| 50 కోట్లు | పురాణజీవ యుగము | లోతులేని సముద్రములు |
| | 1. సిల్యూరియను | వాచు, నీటిక్రిములు, |
| | 2. డెవోనియను | సముద్రపుచేపలు (మత్స్యయుగము) |
| 20 కోట్లు | మధ్యజీవ యుగము | మొదటినేల మొక్కలు కప్పలు, బల్లులు, తాబేళ్లు, (కూర్మయుగము) |
| | 1 ఉభయ చరములు | (కర్బనకరములు) |
| 8 కోట్లు | 2 సరీసృపములు | తుప్పలు, తాళ్లు, పాములు, మొసళ్లు, దినోసార్లు గింజలచెట్లు |
| 4 కోట్లు | నవజీవయుగము | మహాగిసలు, పక్షులు(వరాహయుగం) సస్తనులు, గడ్డి, అడవిచెట్లు. |
| | ఆధునికయుగము | 1 నారసింహ యుగము |
| 2½ లక్షలు | 1-2 హిమయుగము | గచ్ఛన్నరవానరులు ఛింపాంజి గోరిల్లా హీడిల్బర్గ ఉదయనరుడు |
| 1 లక్ష | ii 2-3 ,, | నియాండర్తలరు |
| 50 వేలు | iii 3-4 ,, | గుహావాసులు, రోడేసియను |
| | నరయుగము | (క్రొమాగ్నను గ్రిమాల్డీలు వేట) |
| | పూర్వశిలాకాలం | వ్యవసాయాది, జాతరలు, |
| 30 వేలు | నవశిలా ,, | చక్కనిపనిముట్లు, (గోధుమవర్ణులు) |
| 15 వేలు | సూర్యశిలా ,, | సుమేరియను, నేటివరకు |
| 10, 8 వేలు | చారిత్రక ,, | |

ఈయంశములగూర్చి మనప్రాచీనుల భావముల
కొంతగమనింపుదము. అవ్యక్తసత్త్వదార్థమునుండియే వ్యక్తు
లన్నియు అనుకూలతేజఃప్రసారకాలమున గలిగెనని*,
ఆప్రాణులు జలమందే ఆరంభించెనని†, ఆ జీవకారణమగు
మహాశక్తి అణువయ్యు విశ్వవ్యాపియై చైతన్యమిచ్చునని
యు‡, కాని దానియథార్థతత్త్వము మనకుదెలియదనియు§
మనపూర్వుల భావము.

ఇట్లు సృష్టిని నియమించు పరమాత్మశక్తి సర్వాంత
ర్యామి సర్వభూతసమము సర్వవ్యాపి విశ్వరూపాకారము
నై యుండును‖ ఆయాయుగములందు లోకోద్ధరణకై భగ

---

* అవ్యక్తాత్ వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే (భ.గీ.8-18)

† సఇమాల్లోకాన సృజతాంభోమరీచీః...అథస్తాత్మా ఆపః
......ఆప ఏవపురుషం సముద్ధృత్యా మర్ఛయత్. (ఐ. ఉ. 1-1-3)
ఆప ఏవససర్జాదౌతాసు వీర్యమథాసృజత్ (మ. స్మృ. 1-8)

‡ అణోరణీయాన్మహతో మహీయానాత్మాఽస్యజంతోర్ని
హితో గుహాయాం (క. ఉ. 1-2-20)
నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానామేకో...(క. ఉ. 2-5-13)

§ యస్యామతం తస్యమతం; మతంయస్యనవేదసః
అవిజ్ఞాతం విజానతాం, విజ్ఞాతమవిజానతాం (కే. ఉ. 2-3)

‖ సఏవకాలే...పాశాంశ్ఛినత్తి (శ్వే. ఉ. 3-15)
" ఐతదాత్మ్యమిదం సర్వం......"(ఛాం. ఉ. 6-8.)
దివిసూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా, యదిభాస్సదృశీసా
స్యాద్భాసస్తస్య మహాత్మనః (భ. గీ 11-12)

వంతుడవతారమెత్తెనని అందు దశావతారములు ముఖ్యములనియు మనపూర్వులభావము. వానిక్రమమును గమనించినచో, ప్రారంభదశయందు అనగా వైజ్ఞానికుల పురాణ జీవయుగమున కేవలజలచరమగు మత్స్యముగను, తరువాత (మధ్యజీవయుగమున) ఉభయచరమగు కూర్మముగను, అంతట (నవజీవయుగమున) సస్తనము శిశుపోషకము పిండజము అగు వరాహముగను, పిమ్మట (ఆధునికయుగపు మొదటి రెండుహిమమధ్యయుగములందు) కొంతతిర్యగ్జంతుస్వభావము కొంతనరలక్షణములుగల నరసింహాకారముగను, ఈశ్వరాంశ మీజగత్తునం దవతరించెనని తేలును. తరువాతనే నరావతారములుగలైను; ఆవరుసలోను విశేషముకలదు: ఆదిమనరులు మూడుజాతులు (శ్వేతహారితజాతి, గోధుమవర్ణము, నీలవర్ణము) అగుటను, వారు ప్రాచ్యోత్తర దక్షిణ పశ్చిమదిశలను జగత్తు అంతటను వ్యాపించుటను, ఆదిమనరులు సంచారిజాతులుగ నుండుటను, వామనుని త్రివిక్రమత్వము త్రిలోకాక్రమణము సూచించును; (పూర్వశిలాకాలము). తరువాత పరశురాముడు కందమూలసంపాదకమగు లోహోపకరణ మొందుట, శ్రీరాముడు కోదండపాణియై వేటజీవనము కవసరమగు విల్లంబులతో నుండుట, ఆతరువాతవచ్చిన బలరాముడు వ్యవసాయచిహ్నమగు నాగలి ధరించి గోపాలసోద

రుపడగుట (నవశిలాకాలము), ఆపిమ్మట నే జ్ఞానవికాసచిహ్నముగ బుద్ధుడవతరించుట, నరజాతియొక్క క్రమవికాసమును సూచించును; ముందు మనజగత్తుకింకను గొప్పపరిణామము కలుగనున్నదని భావికల్క్యవతారము సూచింపవచ్చును. ఇట్లీక్రమము వైజ్ఞానికసిద్ధాంతపు క్రమమునకు సుమారుగ సరిపోవుట కేవల కాకతాళీయ మనవీలులేదు.

ఇట్లీయుగయుగములద్వారా జరిగిన జీవవికాసము భూమిపై మనయందరిలోగూడ లీనమై ప్రత్యక్షముగు చున్నది. ప్రతిప్రాణియు గర్భస్థదశలోనో అండదశలోనో తనజాతికన్న నీచములు పూర్వయుగపువి అగు జీవుల ఆకారమును ముందుగా పొందియే, తరువాతక్రమముగా తనజాతి జంతువుగా పరిణమించును. ఇట్లుప్రతిస్తనజంతువును పిండదశలో మత్స్యాకృతిని అంతట కూర్మసరీసృపాది రూపములను పొందియే తనజాతిదేహమొందునని వైజ్ఞానికులు గనిపెట్టిరి. ఇట్లేమానవప్రాణియు తల్లి గర్భమున పిండముగనున్న మొదటినెలలలో ఆరంభమున ద్రవరూపముగా సూక్ష్మజీవిగను, అంతట మత్స్యాకారముగను, ఏర్పడును; తరువాత అందు పరిణామము కలుగుచురాగా, చేపతిత్తులు మున్నగునవి పోయి చిన్న స్తనాకృతినొంది, ఆపైన మేధాశక్తి యేర్పడి, అంతటఒకవిధమగు వానరాకారము ఏర్పడును; ఇట్లు కొన్ని నెలలు పరిణామము కలిగినమీదట

నే, నరరూపము గల్గును.†నరశిశువుజనించినతరువాతగూడ మొదట పరుండియేయుండి, తరువాతకొద్దిగాను త్వరగాను కూర్మవరాహాదులవలె ప్రాకుచు అవ్యక్తధ్వనుల జేయుచు, ఆతరువాతనే మాటల నేర్చి, ముందుగా కోతులవలె కొం. చెముగలేచి అడుగులు వేయనేర్చి, ఆపిమ్మట నరులవలె మాటాడుచు, నడుచుచుండును. మనభూభారమంతయు, (నరులు దేవతలు మోయక), మహామీనము ఆదిశేషుడు ఆదికూర్మము ఆదివరాహముదిగ్గజములునే మోయుచున్న వనుటలో గూడ యుగయుగములుగాను ప్రతినరవ్యక్తి లోను ఉండుజీవుల కాధారమట్టే యేర్పడెనని, అవరుసనె ప్రాణులు వృద్ధియయ్యెనని గూడ, సూచితము కావచ్చును.

ఆయాజాతులనరులు వివిధదేశములకు వ్యాపించి వేరువేరు దేశీయులైరి; వారిలో చాలమంది అసలు ఏకజాతీయులే ఏకప్రాంతీయులే అని, వారి శిరోనిర్మాణమువల్లనేగాక, వారు మాట్లాడు భాషలసంబంధమువల్లను స్పష్టము. మన ఆర్యావర్తభాషలును యూరపులోని ఇంగ్లీషు ఫ్రెంచి జర్మను మున్నగునవియు సన్నిహితములు, అసలు ఒకేభాషనుండి వెలువడెను, అని భాషాశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. ఇట్లే ద్రావిడభాషలలోను పరస్పరసంబంధము కలదు. వాని పరస్పరసంబంధరీతి ఇందు చేర్చిన పట్టికచే తెలియును.

† ముందు 33 వ పుట టిప్పణిజూడుడు.

# ముఖ్యమగు ఆర్యభాషలు.

- మూలార్యభాష.
  - యూరపుశాఖ
    - కెల్టికు
      - ఐరిషు
    - ట్యూటనికు
      - ఇంగ్లీషు.
      - డచ్చి.
      - జర్మను.
    - లాటిను
      - ఫ్రెంచి.
      - ఇటాలియను.
      - స్పానిషు.
    - గ్రీకు
    - రష్యను
  - ఆసియాశాఖ
    - ఆర్మీనియను.
    - ఇరానీ (జండ్).
      - పర్షియను
    - వేదసంస్కృతము
      - ఆధునికసంస్కృతము.
      - ప్రాకృతశాఖలు.
        - శౌరసేని
          - పంజాబీ.
          - మహారాష్ట్రి.
            - మరాఠీ
          - ఘూర్జరి
            - గుజరాతీ
        - అర్ధమాగధి
          - అవంతి
            - పశ్చిమహిందీ.
          - తూర్పుహిందీ.
          - ఓఢ్రము
        - మాగధి
          - ఓఢ్రము
          - బంగాళీ
          - అస్సామీసు

# ముఖ్యద్రావిడ భాషలు.




ముఖ్యసెమిటిక శాఖవి: హిబ్రూ, అరబ్బీ భాషలు.
ముఖ్య మంగోలు ,, తుర్కీ చీనా జపాను.

(మూలార్యభాష మూలద్రావిడము పదిపంద్రెండు వేల యేండ్లపూర్వము వాడుకలో నుండియుండును.) ఈ మూలార్యభాషకు, మూలద్రావిడముకు, సెమిటికు మంగోలియను మూలభాషలకును, అంతకు పూర్వమున పరస్పర ముండెనో, లేదో, భాషాశాస్త్రజ్ఞు లింకను నిర్ణయింప లేకున్నారు.

మన ప్రాచీన భారతార్యులును అప్పటి ద్రావిడులును గూడ చాల నాగరికులై యితరదేశములతో దూరవ్యాపారముచేయుచుండిన సూచనలు గలవు. పురాతనరాజులు ఋషులు త్రివిష్టపాదులకు వెళ్ళి మరల భారతదేశము చేరుచుండినట్లు పూర్వగ్రంథములందు తెల్పబడెను; క్రీ. పూ. 5,6,వ శతాబ్దులందే భారతీయవిద్వాంసులు శిల్పులు పారసీకరాజ్యమందుండినట్లును, అశోకవర్ధనుని కాలమున (క్రీ. పూ.3వ శతాబ్దిలో)అలెగ్జాండ్రియా సిరియా మున్నగుప్రాతములందు శ్యామసింహళాది ప్రాచ్యదేశములందు గూడ బౌద్ధతత్వజ్ఞులు శిల్పులు బౌద్ధమతమును భారతీయశిల్పకళాదులను వ్యాపింపజేసినట్లును, స్పష్టనిదర్శనములు గలవు. (యూదదేశమున ఏసుక్రీస్తు బోధించిన క్రైస్తవమతముకు గూడ కొంతవరకు హిందూబౌద్ధసిద్ధాంతము లాధారములై యుండునని కొందరు విమర్శకుల అభిప్రాయము.)

౨

తరువాత కనిష్క-శాతకర్ణి గుప్తరాజాదుల కాలమందును భారతీయులు తత్వశాస్త్రభౌతికవిజ్ఞానములందును శిల్ప కళాపరిశ్రమలందును గూడ ప్రవీణులై వానిని ఇతరదేశములకును వ్యాపింపజేసినట్లు, ఆప్రాంతములందు స్పష్టనిదర్శనములు గలవు.* ఇట్లితరదేశీయులకన్న హెచ్చుగశక్తి విజ్ఞానయుతులైనను, ప్రాచీనభారతీయులు, ఇప్పటి కొందరివలె స్వార్థపరులుగాక, తమవిజ్ఞానము నంతటను వెదజల్లి 'లోకాసమస్తా స్సుఖినోభవంతు' అను విశ్వజనీనభావముసే గలిగియుండిరి. అప్పుడు మనదేశము ప్రాచీనప్రపంచమునకు నాయకమణిగ నుండెను. †

---

*ముందు 176 245 334 పుటలు జూడుడు.

† అట్టిచో మనప్రాచీనగ్రంథములలో కొన్నిచోట్ల సముద్రయాననిషేధమేల చెప్పబడెనని సందేహము కలుగవచ్చును. ఆనిషేధము మొదటినుండి లేక మధ్యకాలమున (జపానీయులలోవలె) ఏర్పడెను. క్రి. శ. 2,3 శతాబ్దుల ప్రాంతములయందు అన్యదేశములందు తీవ్రముగ ప్రబలియుండిన అంటుజాడ్యములు,సంచారిదళబాధ,అశాంతస్థితి, మనకు వ్యాపింపకుండుటకా నిర్ణయముచేయబడి యుండునేమో! సముద్రమున తుపానుల ప్రమాదమునప్పు డధికమై యుండవచ్చును. ఏమైనను, అప్పటి మనఋషులు దేశకాలావసరములబట్టి చర్చించి తమయాచార వ్యవహారములను ధర్మశాస్త్రవిహితశాస్త్రములనుగూడ దేశహితకరమగునట్లు మార్చుకొనుచు వచ్చిరనుటకు నిదర్శనములు గలవు.

ప్రాచీనభారతీయులు స్వదేశ మందును అభిమానము వీడక, భారతదేశమంతటను ఏకమతము ఏకవిజ్ఞానము ఏక నాగరికత వ్యాపింపజేసిరి; వివిధప్రాంతములకు తీర్థయాత్రల బ్రోత్సహించియు గ్రంధాదుల మూలమునను దేశసంచారమును దేశపరిజ్ఞానమును పరస్పర సానుభూతిని వృద్ధిచేసిరి. యూరపు ఉత్తరఅమెరికాయున్నగు ప్రాంతములందార్యులు వసించి నప్పుడాయా దేశముల ఆదిమజనుల నిర్దాక్షిణ్యముగ నశింపజేసిరట్లు చరిత్రలవలన విశదము. మన భారతీయార్యులట్లు చేయలేదు; ఆదిమ ద్రావిడ జనులు వారలనాగరికతగూడ దేశమున వ్యాపించెను; ఈనాగరకతల మధ్య వీలైనంతవరకు సంబంధము సమీకరణము కలుగజేయబడెను. ఇట్లు జాతీయతకును అంతర్జాతీయతకును సమన్వయముజరిగెను.

---

"అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్నతు, సముద్రయాత్రాస్వీకారః కమండలు విధారణం......ఇమాన్ ధర్మాన్ కలియుగే వర్జ్యానాహుర్మనీషిణః; (బృహన్నారదీయము) అ. 22-12-16.

దత్తౌరసేతరేషాంతు పుత్రత్వేనపరిగ్రహః, శూద్రేషుదాసగోపాల కులమిత్రార్ధసీరిణాం, భోజ్యాన్నతాగృహస్థస్య తీర్థసేవాతిదూరతః.........ఇమానిలోకగుప్త్యర్థం కలేరాదౌమహాత్మభిః, నివర్తితాని కర్మాణివ్యవస్థాపూర్వకం బుధైః, సమయశ్చాపిసాధూనాం ప్రమాణం వేదవద్భవేత్." (ఆదిత్యపురాణవచనం)

మనప్రాచీనవిద్వాంసులు విశాలజ్ఞానానుభవములు లేని సంకుచితభావులను 'కూపకూర్మములు' అనిరి; ఆనాటు కరణము ఈనాడు వారి వంశీయులకే నర్తించునని కొందరు చెప్పు స్థితి కలిగినది. ఆయుదారభావము, జ్ఞానాకాంక్ష, స్వతంత్రవిమర్శ, పురోభివృద్ధి వాంఛ, మనపరాధీనదేశమున క్షీణించినవి; బాహ్యచిహ్నములే ముఖ్యములైనవి; సంకుచిత ప్రాంతీయభావములు, పరస్పర విభేదములు, ప్రబలినవి.

ఇట్టివి పోవుటకు ప్రపంచచరిత్రజ్ఞానము ఉపయోగకరమగును. జగదుత్పత్తి వికాసములను ఆయాజాతుల చరిత్రమును గ్రహించుటచే మనోభావములు హృదయము వికాసమునొందును; జాతీయభావము విశ్వజనీనతకలుగును. ప్రస్తుతమున్న విభేదము లెట్లు కలిగెనో తెలిసి, ఆయాజాతులమధ్యయధార్థముగ విరోధభావమునకవసరము లేదని, ఈకనపడు విభేదములు బాహ్యములు తాత్కాలికములు అని, తెలియును. ప్రపంచచరిత్రాభ్యాసము ముఖ్యముగా మనభారతీయులకుచాలయవసరము. మనదేశము అన్నివిధములను ఒకసంగ్రహప్రపంచము. అందు అతిఫలవంతములగు నదీప్రాంతభూములు, విశేషవర్షప్రాంతములు, మరుభూములు, మహాటవులు, రాతినేలలు, పీఠభూములు,

మహాపర్వతప్రాంతములు, అత్యుష్ణప్రాంతములు, శీతలదేశములు గలవు; అజానుబాహువులు, పొట్టిజాతులు, మహాశూరులు, భయస్వభావులు, కుశాగ్రబుద్ధులు, మందమతులు, వ్యాపారకుశలురు వేరువేరు జాతులవారును, కలరు; మహోన్నతమగు ఉపనిషన్మతమును, మూఢదురాచారములు క్షుద్రగ్రామదేవతలబలిపూజామతములుగూడ, ఒకదానిప్రక్కనొక్కటి వెలయుచున్నవి. ఆదిమ ద్రావిడ ఆర్యనాగరికత లేగాక, అన్యదేశనాగరికతలు గూడ గలవు. ప్రపంచపు ముఖ్యమతములన్నియు ఇచ్చటగలవు.

ఆగర్భశ్రీమంతులగు రాజకుటుంబములు, నిరుపేదలగు భిక్షువులు, కలరు. ఇట్లు విభిన్నమతసంఘస్థితులుండు చోట వాని ఉత్పత్తిక్రమము వానిసంబంధము తెలియుట పరస్పరానుకూల్యముండుటకు సహకారియగును. ముఖ్యమతము లన్నింటికి సంబంధము కలదని, వాని మూలసూత్రము లొక్కటియని, కొన్ని చారిత్రకకారణముల వలన ఆ యా పరిసరపరిస్థితుల కనుకూలమగునట్లు వేర్వేరు మతము లేర్పడి వానిలో క్రమముగా దేశకాలానుసారముగ పరిణామము కలుగుచు వచ్చెనని, జగత్కథ తెల్పును; నిజముగా వీని మధ్యవిరోధముండుట కవసరము లేదు. గడచిన నూరేండ్లలో ఆధునిక విజ్ఞానమువలన

ఇనుపదారులు, సముద్రనావలు, తంతివార్తలు, వాయు విమానములు, సినీమాలు, మున్నగు సౌఖ్యము లేర్పడి, దేశములమధ్య రాకపోకలకు ఇతరదేశముల జూచుటకు సమపాయములు పరస్పరసమావేశము చాల హెచ్చినవి; తన్మూలమున ఆర్థికసాంఘిక రాజకీయవిషయములందు గూడ పరస్పరసంబంధము తప్పనిసరియైనది. ఏఅమెరికా లోనో జరుగు పరివర్తనముచే గూడ మన. ఆర్థికాదిపరి స్థితులు పూర్తిగా మారుచున్నవి. మానవుని కష్టసుఖము లొకేరీతివి. ఒకదేశము చిక్కులలో బడగనే ఆ బాధ ఇతర దేశములకును వ్యాపించుచున్నది. కనుక అన్నిజాతుల యొక్కయు ముఖ్యదేశము లన్నిటియొక్కయు ఇతిహాసపు ముఖ్యాంశములను మనమందరము గ్రహింప వలెను. చరిత్రాభ్యాసముచే వేరొక గొప్పనీతియు విశదమగును. ఆత్మవిశ్వాసము గలిగి తమతోటి జనుల సంఘాభివృద్ధికై నిరంతరకృషిచేయు సాహసిజాతులే క్రమముగా వృద్ధిలోకి వచ్చిరని ఇతిహాసము తెల్పును. జనులందరు నీశ్వరాధీను లే యైనను స్వయంకృషిలేని మందజాతులు క్షీణించు చున్నవి. ఇతిహాసమే గాక పూర్వయుగముల జీవకోటి చరిత్రయు ఈసంగతిని దృఢపర్చును. దేశకాలానుకూలముగ తమ యభ్యాసాదుల మార్చుకొనని మందములు అలసము

లు అగు ప్రాణులు వృద్ధిజెందలేవు; నిరంతరము శ్రమపడు జాతులే అవసరమగు అంగజ్ఞానవృద్ధి నొంది యభివృద్ధి గాంచి చిరస్థాయులుగ వ్యాపించును.

జీవపరిణామము తెల్పు ఈనీతిని మరువకూడదు. సర్వ జీవజాతులును సకలభూతాంతర్యామియగు మహాశక్తిచే చోదితములయ్యు స్వయంకృషిచేతనే వృద్ధినొందును. కాని కేవల భౌతికబలమునే వృద్ధిజేసుకొనుచు తమోగుణోపేత ములై క్రూరములై యుండు మహాజరములు డినోసార్లు మున్నగుపూర్వయుగముల క్రూరవికృత జంతువులు పూర్తిగ నశించి, వానిజాతులు నిశ్శేషములైనవి; పూర్వమొకప్పుడు మనలోకమంతటను ముఖ్యజీవములై ప్రబలిన సరీసృపము లిప్పుడు హీనస్థానమున నున్నవి. అట్లుగాక, మనోబలము ను అంతశ్శక్తిని సాంఘికసహృదయభావమును సంఘ క్షేమపరతను వృద్ధిచేసుకొనిన జంతువులే కాలక్రమమున ఆయా యుగాంతముల ప్రళయముల దాటగలిగి వృద్ధి యైనవి. అట్లు ఆత్మ మనశ్శక్తుల వృద్ధిజేసుకొనిన జీవుల నుండియే వానరములు ప్రస్తుతపు నరజాతులు కలిగెనని వైజ్ఞానికుల సిద్ధాంతము. మరియు జీవులు కొంతవరకు పరి సరములవల్లను తోటి ప్రాణులవల్లను మారును. అందు వలన మన పరిసరములను తోటిజీవులను బాగుచేయుట

మన ఆత్మాభివృద్ధికి అవసరము: అనగా సంఘక్షేమముకై నిష్కామకర్మచేయుటవల్లనే నిశ్శ్రేయసము నందుదుము. అట్లుగాక నిష్క్రియులముగనో స్వార్థకార్యతత్పరులముగనో ఉండుటచే నిశ్శ్రేయసము నందలేము. అన్నిజీవులలోను వ్యాపించియున్న ఆత్మస్వభావ మొకటే; అందుచే సర్వభూతములందు సమబుద్ధియుండుట యవసరము.

జీవవికాసకథను మానవసంఘచరిత్రను సంగ్రహముగ దెల్పు గ్రంథమింతవరకు మన ఆంధ్రమున (నాకు తెలిసినంతవరకు తక్కిన మనదేశభాషలలోను) లేదు.

పరిణామసిద్ధాంతనిదర్శనముల గూర్చి శ్రీచింతా దీక్షితులుగారొక చిన్నపుస్తకము వ్రాసిరి. వెనుక శ్రీగాడిచర్ల హరిసర్వోత్తమరావుగారు ప్రపంచచరిత్రము నాయా దేశముల వరుసను విపులముగ వ్రాయదలచి గ్రీసుచరిత్రమును ప్రచురించిరి; అంతటితో విరమించిరి. మన భారతదేశమునుగూర్చియైన ఇంతవరకు సమగ్రేతిహాసము లేదు; విద్యార్థుల పుస్తకములు కొన్నికలవు. జపాను రష్యా అమెరికాసంయుక్తరాష్ట్రములు మున్నగు కొన్ని దేశములగూర్చి విడివిడిగ చిన్నపుస్తకము లిటీవల వెలువడినవి. ఇట్టి ప్రత్యేకదేశచరిత్రలకును ఆయాసాంఘికశక్తుల పరిణామమును సామాన్యసమస్యలను దెలుపుచు పరస్పరసమన్వయమును సూచించు లోకేతిహాసముకును భేదముకలదు

ఇందలిమూలము శ్రీవెల్సుగారి "షార్ట్ హిస్టరీ ఆఫ్ ది వరల్డ్" అను ఆంగ్లగ్రంథమునకు అనువాదము. హెర్బర్టుజార్జివెల్సుగారు జగద్విఖ్యాతులు; ఆంగ్లవాఙ్మయాభిజ్ఞులందరు ఈయన ప్రతిభను వినియే యున్నారు. ఈయన 1866 లో జనించి, ఆక్సుఫర్డులో జంతుశాస్త్రమున పట్టపరీక్ష నిచ్చి, ప్రకృతిశాస్త్రప్రవీణుడయ్యెను; కాని పత్రికాసంపాదనగ్రంథరచన వృత్తిగజేసుకొనెను; అనేకాఖ్యాయికలను, ఇతరగ్రంథములను, రచించెను. ఆర్థికరాజకీయములం దీయన "రైట్‌వింగ్ సోషలిస్టు" (=సాంఘికవాదులలో మితవాది); ఆభావముల ప్రచారముకై 'వర్క్ వెల్త్ అండ్ హాపినెస్ ఆఫ్ మాన్‌కైండ్' (=నరజాతిసుఖము కర్మసంపదలు) మున్నగు అనేకగ్రంథములవ్రాసెను. తననవలలగూడ, జనులలో మూఢత్వము పోగొట్టి విజ్ఞానాభిరుచి కల్గించి, సాంఘికభావములను విజ్ఞానమును వెదజల్లుటకు నైతికపరిణామము గల్గించుటకునే వ్రాసెను. వైజ్ఞానికాగ్రణులసాయము నొంది "ది ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ" అను విపులేతిహాసమునుగూడ రచించెను; కాని అది చాల వివరములుకలదై మామూలుచదువరులకు విసుగు కలిగించును. ఈ "షార్ట్ హిస్టరీ" [illegible] సామాన్యపాఠకుల ఔత్సుక్యమును తీర్చును. వెల్సుగారి

భావములవలె ఆయనశైలియు రమ్యమయ్యు అతిగుంభి
తము, నిగూఢము, అనువదింప నతికష్టము. ఇందు వినో
దముకన్న విజ్ఞాన మెక్కువ ముఖ్యము. అందుచే తెను
గున వ్రాయుటలో శైలి ధారాళతకన్న మూలసంగతుల
సరిగ తర్జుమా చేయుటకే ముఖ్యముగ యత్నించితి. ఇందు
మామూలు రాజయుద్ధాదులకథయేగాక. సంఘపరిణామా
దులును సంగ్రహింపబడినవి. ఈశైలిగ్రంథము ననువదిం
చుటకన్న తెనుగున స్వతంత్రముగ వ్రాయుటయే సుకర
ముగ తోచినది. కాని వైజ్ఞానికేతిహాసగ్రంథమును అందు
ప్రవీణుడనుగాని నేను స్వతంత్రముగ వ్రాసిన నది ప్రామా
ణికముకాదు. అందుచే వెల్సు ననువదించుటే ఉచితమని
తోచినది.

ఇతిహాసము రెండువిధములు: ఆయారాజాదివ్య
క్తుల యుద్ధాదివృత్తాంతములను వరుసగా కార్యకారణ
సంబంధములతో తెలుపుట సాంప్రదాయికపద్ధతి. వానికి
ప్రాధాన్య మీయక, ఆయాజనసంఘములందు కాలక్రమ
మున జరిగిన పరిణామముల దెలుపుచు, అందు కవసర
మగునంతవరకే ఆయానాయకుల చర్యలగూర్చి తెల్పుట
రెండవదగు వైజ్ఞానికపద్ధతి; ఇదియే యెక్కువ జ్ఞానదాయ

కము, ఉపయోగకరము. ఆంగ్లమునను ఈరీతి చరిత్రను మొదట వ్రాసినది వెల్సుగారే. †మరియొకసంగతి: ఈగ్రంథమున భూమి ఉత్పత్తిక్రమము, అందు ఆయాయుగముల జీవవికాసము, క్రమముగా నరజాతి యావిర్భావము,అందు కలిగిన క్రమవికాసము,ఇప్పటి వైజ్ఞానికసిద్ధాంతములప్రకారము వర్ణింపబడి, అంతట మామూలు ప్రపంచజాతుల యితిహాసము వివరింపబడినది. అందుచే నీపుస్తకమున ఆయాస్థలములందు భూతత్వశాస్త్రము, జీవశాస్త్రము, ప్రాచీననరశాస్త్రము, జాతిశాస్త్రము, సాంఘికతత్వ మనశ్శాస్త్రములు, సాంఘికవాదము మొదలగువాని కొన్నిమూలసూత్రములును, మతసూత్రములును, సందర్భోచితముగ మిళితములైనవి. ఇందలి ఇతిహాసభాగమున ఆయాకాలములందు ఆయాజాతులస్థితి, వారిసమ్మేళనముచే నాగరికతలో కలిగిన మార్పులు, వివరింపబడినవి. ఇందు నరజాతి ఆర్థికసాంఘికధార్మికరాజకీయస్థితులన్నిటిలో కలిగిన క్రమపరిణామము వాటి పరస్పరసంబంధము సూచితము. ఇందు ప్రాచీనమిశ్ర (=ఈజిప్టు) దేశము సుమే

---

†ఇటీవలనే శ్రీ జవహరలాల్ నెహ్రూగారు "గ్లింప్సెస్ అఫ్ వరల్డ్ హిస్టరీ" అనుపేర నొక విపులగ్రంథము వ్రాసిరి. అందలి కొన్ని భాగములబట్టిచూడ అది కేవ లేతిహాసముకాక నరుల రాజకీయాదిభావముల కేంద్రీకరించు వ్యాసపుంజముగ గన్పట్టును.

రియా అస్సీరియా మొదలగువాటిసందర్భమున చెప్పబ
డిన గ్రామదేవతలగుడులు మతాధికారులు జంతుబలులు
మొదలగుపరిస్థితులు మనదేశపు పూర్వపు ఆదిమద్రావిడ
జాతులలోగూడ నుండెను; అవి యిప్పటికిని అచ్చటచ్చట
ముఖ్యముగా మనదక్షిణభారతదేశమందున నిమ్నజాతు
లందు విశేషముగాను నిల్చియున్నవి; అవి మనదేశపు ఆర్య
నాగరికతనుగూడ మార్చినవి. అందుచేత నాసంగతులును,
వెల్లునగా రింపు సూచించిన 'దేవసమన్వయము'ను, కొంతవ
రకు మన మతాచారములకును వర్తించునని తోచును.
తక్కినచరిత్రలవలెగాక, ఇందు బుద్ధుడు క్రీస్తు మహమ్మదు
మొదలగు మతప్రవక్తలగూర్చియు చెప్పబడినది. నిజమగు
మతాభిమానులు రాజకీయముగను స్వతంత్రభావులౌదు
రని సూచింపబడినది. మూలగ్రంథమున సహజముగ
క్రైస్తవసిద్ధాంతములకు అమతపరిణామమునకు ప్రాము
ఖ్యముకలదు. చరిత్రమున మతమునకును స్థానము గలదు.
ప్రపంచము భౌతికమేకాదు. పంచభూతతన్మాత్రలకు బుద్ధి
అహంకారము మూలమని, వీటికన్నిటికి ఆత్మమూలమని
సనాతనహిందూసిద్ధాంతము. భౌతికపరమాణువులు స్వ
తంత్రపదార్థములు కావనియు, అవియు అతిసూక్ష్మములు,
దుర్గ్రాహ్యములు, దుర్భేద్యములు అగు శక్తిపుంజముల

సముదాయరూపములే అనియు, ఈపరమాణువుల అంగములగు ఎలెక్ట్రనులు ప్రోటనులు మొదలగువాటి మూలాధారమగుశక్తి అవ్యక్తచిత్ స్వరూపమే అనియు, అందుచే విశ్వమూలాధారము భౌతికముకాక మానసికము ఆధ్యాత్మికమునే అగునని ఇటీవల ఎడ్డింగ్టన్ సర్ జేమ్స జీన్సు మొదలగు వైజ్ఞానికప్రముఖులు నిర్ణయించినారు. ఆయా కాలముల సాంఘికాధ్యాత్మికపరిణామములచే రాజకీయ చరిత్రయు చాలవరకు మారుచుండును. మరియు వ్యక్తుల లోను శరీరమునకు మనస్సునకు హృదయమునకు పరస్పరసంబంధము చాల గలదు. ఇంతేగాక సృష్టిలో మొదట మహాభౌతికబలము కలవయ్యు తీవ్రములై నిదానములేని క్రూరసరీసృపాదులనుండి నిదానము ఆలోచనగల పక్షిజంతుజాతులు అంతట సూక్ష్మబుద్ధులు దాక్షిణ్యావంతములు అగు వానరాదులు విశేషమానసికాత్మికశక్తులుగల నరజాతి ఏర్పడి ప్రబలుటబట్టియు,సృష్టిలో జ్ఞానమునకు ఆత్మశక్తికి ముందింక నెక్కువప్రాధాన్యము కల్గునని తోచును. మరియు ఇస్లాము క్రైస్తవాదిమతములు భౌతికచరిత్రప్రవాహమున గూడ ప్రత్యక్షముగ మార్పుల గల్గించినవి. అందుచే జ్ఞానమతములకు చరిత్రమున దగుస్థాన ముండవలెను.

మూలమువలె నీపుస్తకమును ఒకచిన్న సంపుటముగనే వ్రాయబూనితిని. అనువాదమున మూలాంగ్లగ్రంథము

లోని సంగతుల నేమియుమార్ప లేదు. ఆంగ్లపాఠకులకు ప్రసిద్ధములై మూలమున వివరము లీయని కొన్నినదీనగరాదు లెట్టివో ఏప్రాంతపువో అట్టిసందర్భములు ఉన్నతవిద్య లేనివారికిగూడ దెలియుట కవసరమగునంతమాత్ర మతిక్లిష్టముగ నందే చేర్చితిని. వెల్సుగారు మూలమును కొంతవరకు పాశ్చాత్యదృక్పథముతో ఆంగ్లపాఠకులకై వ్రాసిరి.† కనుక ఆపాఠకులకవసరమని తోచువిషయములకే ప్రాధాన్యమిచ్చిరి.

లోకచరిత్రను ఒకేసంపుటములో వ్రాయునప్పుడు ఆయాప్రత్యేకదేశముల ముఖ్యచారిత్రవిషయములన్నిటిని తృప్తికరముగ వ్రాయవీలుండదు. ఈపుస్తకమందు ఏప్రత్యేకదేశమును గూర్చియు పూర్తియైనచరిత్ర లేదు. ఐనను అంతర్జాతీయసమస్యలు గ్రహించుటకును ప్రపంచచరిత్ర సమన్వయము తెలుసుకొనుటకును అవసరమగు ఆయా పాశ్చాత్యదేశముల ముఖ్యసంగతులన్నియు వ్రాయబడినవి.

---

†ఇందు కొన్ని అధ్యాయముల జదువునపుడు పాఠకు లీసంగతిని జ్ఞప్తిలో నుంచవలెను. బైజంటైను (=కాంస్టాంటినోపిలుప్రాంతపు) సామ్రాజ్యము, యూదపారసీకాదిదేశములు తూర్పురాజ్యము లని తరుచు సూచింపబడును. అవి మనదేశమునకు నిజముగ పడమరగనే యున్నను, రోమునకు ఇంగ్లండు మున్నగు పశ్చిమయూరపుప్రాంతములకు తూర్పుగ నుండుటచే నట్లు వ్రాయబడినది.

అట్టివే భారతదేశసంబంధులగు సంగతులుకొన్ని మూలాంగ్లముగవిడువబడినవి. అట్లు విడచిన, పూర్వయుగములందు మనప్రాంతపు భౌతికస్థితి, భారతదేశపు ప్రాచీననాగరికత, ప్రపంచమును ఋగ్వేదప్రాముఖ్యము, సనాతన హిందూ మతమునుండి బౌద్ధమతము కలిగినరీతి, ఈ రెంటికిని యూద క్రైస్తవమతసిద్ధాంతములతో గల సంబంధము, సనాతన వైదిక ద్రావిడాది నాగరికతల మిశ్రణఫలితము, దేవసమన్వయము,హిందూ ముస్లిం మతాచారభేదము, మనదేశపు ముఖ్యేతిహాసవిషయములు, ఆర్థికక్రాంతిఫలము ఇట్టివానిని గూర్చి అవసరమైనచోట్ల సందర్భోచితముగ సంగ్రహముగ నాకుతోచిన పాదటిప్పణులు చేర్చితిని.ఇది భారతదేశచరిత్ర కాదు; కనుక ప్రపంచచరిత్రలో నుండదగిన పరిణామకర ముఖ్యాంశములనే అందు వ్రాసితిని. ఈటిప్పణులను మూలానువాదపు మధ్యనే చేర్చిన వీలుగానుండెడిది. కాని వెల్సుగారిభావముల గ్రహించుటకు పఠనమధ్యమం దాటంకము లేకుండుటకై పాదటిప్పణిపద్ధతినే అవలంబించి, ముఖ్యమైనవాని నాయా అధ్యాయాంతములందు వ్రాసితిని. పాఠకులు వాని ఉచితసందర్భములందు సమన్వయము చేసుకొన ప్రార్థన. టిప్పణులలోని అంశములు రాధాకృష్ణపండితులు, ఆచార్యప్రఫుల్లచంద్ర, రాధా

కుముదముఖర్జీ, బ్రజేంద్రనాథసీల్, మున్నగు సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు పండితులు వెల్లడించినవే. వీలైనంతవరకు మాక్డనల్ గారి సంస్కృతవాఙ్మయచరిత్రము విన్సెంటు స్మిత్తుగారి "ఎర్లిహిస్టరీ" 'ఆక్సుఫర్డుహిస్టరీ' మున్నగుదేశ చరిత్రములు ప్రభుత్వప్రకటితమగు "ఇంపీరియల్ గజటీర్ ఆఫ్ ఇండియా" జనాభారిపోర్టు మొదలగు (ప్రాశ్చాత్యు లందరును ప్రమాణముగ నంగీకరించు) గ్రంథములందు దెల్పినవానినే వ్రాసితిని. కొన్నిసంగతులను ప్రభుత్వపురాతత్వవేత్తలు మొదలగువారి (పత్రికలలో ప్రకటింపబడిన) ఉపన్యాసములనుండియు గ్రహించితిని. (సందర్భముల సమన్వయముకై కొన్ని ఆంధ్రచారిత్రక విషయములగూడ జేర్చితిని). ఈటిప్పణులలోని ఏసంగతులును వెల్సుగారివి కానందున వానిబాధ్యత నాదేగాని వెల్సుగారి బాధ్యత యేమియులేదు.

ఈగ్రంథపుసంగతులబట్టి ఇందు చాల పారిభాషిక పదముల వాడవలసివచ్చినది. ఆంధ్రమున తగు వైజ్ఞానిక నిఘంటువింతవరకు లేకయు ఆపదములకు వాడుకలో తగు

---

శ్రీదిగవల్లి వెంకటశివరావుగారిట్టి పుస్తకము నిటీవల ప్రచురించిరి. కాని అది నాకందునప్పటికి ఈపుస్తకపువ్రాత పూర్తిఅయినది. అందలి కొన్నిపదములకు ఇందులో వాడినవానికి కొంతభేదము తప్పినది కాదు.

స్థైర్యమేర్పడకయు అట్టిభావముల దెల్పుటలో లేఖకులకు, పాఠకులకును. కొంత చిక్కు కలుగుచున్నది; వీలైనంతవర కిదివరకు వాడుకలోనున్న పదములనే వాడితిని; కాని • ఉచితమనితోచిన క్రొత్తపదములగూడ నుపయోగించితిని. కొన్ని వాడుకలోనున్న పదములు సందిగ్ధముగ నున్నవి. ఒకే వైజ్ఞానిక భావమునకు రెండుపదముల వాడుట యుకలదు. ఉ॥ "జియాలజి" అనుటకు భూగర్భశాస్త్ర మని ఆంధ్రమున ధారాళమగు వాడుకకలదు. కాని 'జియాలజీ'లో భూగర్భమునుగూర్చియేగాక భూమిపై నున్న శిలలు కొండలు మొదలగువానినిగూడ పరిశోధించుట భూతత్త్వము తెలుసుకొనుట ముఖ్యాంశము; (పై నున్న పటలము శోధించుటేగాని, వేలకొలది మైళ్ళలోతు గల నిజమైన భూగర్భమును పరిశోధించుట ఇంకను సాధ్య ముకాదు. అయోమయమగు ఈగర్భగోళపు నిజస్థితిని గూర్చి ఇంకను ఏమియు తెలియదు); మరియు శబ్దార్థమును బట్టి ఖనిజశాస్త్రమును భూగర్భశాస్త్రమే; అందుచే భూగర్భపదముక వ్యాప్తి అతివ్యాప్తి రెండును కన్పడును. కనుక 'జియాలజిస్టు'కు 'భూగర్భశాస్త్రజ్ఞుడు' కన్న 'భూతత్త్వజ్ఞుడు' అనుటే యుక్తముగాతోచినది. 'ఎస్ట్రానమీ' అనుటకు 'ఖగోళశాస్త్రము' అనుచున్నాము. ఆయర్థము

ననే 'జ్యోతిశ్శాస్త్రము' అనుపదమునుగూడ తెలుగులో కొందరు వాడుచున్నారు. జ్యోతిశ్శాస్త్రమనుట శబ్దార్థమునకు సరిగనుండుటయేగాక, ప్రాచీనసంస్కృతగ్రంథములందు ఇప్పటి హిందీ బెంగాలి మొదలగు ఆర్యభాషలందుగూడ వాడుకచే, 'జ్యోతిశ్శాస్త్ర' శబ్దము సమన్వయకరమగును. 'జామెట్రీ' అనగా 'క్షేత్రగణితము' అనుచున్నాము; 'జ్యామితి' అనునది యెక్కువ సవ్యమనితోచును. పాశ్చాత్యులభాషలన్నిటిలోవలె మనభాషలలోను ఒకేరీతి పారిభాషికపదము లుండవలెను. కనుక ఇదివరలో ధారాళముగ ప్రచారములోనున్న పదముల విడువకుండనే పై రెండవ రకపు సులభపదములగూడ అచ్చటచ్చట వాడితిని; ఈ పద్ధతినే చరిత్రకు ఇతిహాసమని, హిందూదేశమునకు భారతదేశమని, ఇట్లే ఇతరవిషయములందును రెండువిధములగు పదములును ఇందు జేరినవి. మనదేశభాషలన్నిటిలోను పారిభాషికవిషయములకు సాధారణముగా సంస్కృతపదములనే వాడుచున్నారు. (ఉర్దులోమాత్రము ఇంగ్లీషు, అరబికు, పర్షియన్, పదముల నెక్కువగా వాడుచున్నారు.)

కాని సంస్కృతమున అనేకార్థములగు అట్టిపదములలో కొన్నిటిని బంగాళి హిందిమున్నగు ఆర్యావర్త

భాషలలో నొక అర్థమునను, తెలుగులో నింకొక అర్థమునను, వాడుచున్నారు. 'ఖాకీ' మున్నగు కొన్ని కేవల హిందుస్థానీ పదములును ఆయాభాషలలో వేర్వేరు అర్థములందు వాడబడుచున్నవి. ఈసమస్యను గూర్చి భాషాభిజ్ఞులు విద్యాసంస్థలును తగు శ్రద్ధవహించినట్లు తోచదు.* ఈ 25 సం॥లలో హిందీవ్యాప్తి హెచ్చినది. ఉభయభాషాభిజ్ఞులు కొందరిటీవల కొన్ని పదముల రెండవ యర్థమందుగూడ ఆంధ్రమున వాడుచున్నారు. ఒకేపదమును ఆంధ్రమందును ఆర్యభాషలందును వాడుటలో అర్థవిభేదము సాధ్యమైనంతవరకు తొలగించుట ఉభయ భాషలవృద్ధి సామరస్యములకు అవసరము. ఈ సమస్యను ఆయా భాషాసంస్థలు లేక పరిషత్తు ప్రతినిధులు

---

* ఈవిషయమును చర్చించుచు ఉద్యోగ, వ్యాఖ్యాన, ఉపన్యాస, విశ్వాస, రాష్ట్రమున్నగు కొన్ని పదములపట్టికనిచ్చి, ఈవిభేద సమస్యను భాషాభిమానులు పరిష్కరింప వలెనని, 1921 లో వ్రాసియుంటిని. (జంషెడ్జీ తాతానుగూర్చిన 'తాతాజీవితము' భూమిక vi, vii వ పుటల జూడుడు); ఇట్టివి మత, ధర్మ, ఇతిహాస, ఆగ్రహ, బాష్ప,సంసార, శిక్షా, ఇత్యాది పదములింకను చాలగలవు.

(దేశాదులపేర్లలో గూడ ఇట్టిభేదములుగలవు. ఈజిప్టును హిందూస్థానీలో 'మిశ్ర'దేశమని పర్షియాను 'పారస్' అని అలెగ్జాండరుకు 'సికందర్' అని వాడుదురు.)

భారతీయ భాషాపరిషత్తుగా నేర్పడియో, లేక అంతర్విశ్వ విద్యాలయసమితి (ఇంటర్ యూనివర్సిటీస్ బోర్డు) వారో పరిష్కరింపదగును. అందుచే పరస్పరసమావేశమును భాషాసామరస్యమును గ్రంథముల తర్జుమాను సౌకర్యము హెచ్చును.

నేడు ఆంధ్రమున శైలియు సమస్యయైనది. గ్రాంథిక వ్యావహారముల రెంటికిని ఆదరముకలగు 'వ్యావహారిక' రచనలలో రుచిభేదమునుబట్టియు ప్రాంతభేదమునుబట్టియు ఇప్పటికే భేదములేర్పడుచున్నవి; మన నిజాం ఆంధ్రసోదరులు, బళ్లారిప్రాంతమువారు, గంజాంప్రాంతమువారు, తాముమాటాడురీతినే విశేషముగ గ్రంథములు వ్రాయుచో, ఈవిభేదములింకను హెచ్చి, కొన్నిశతాబ్దములలో ఆంధ్రము వేర్వేరు భాషలవలె గన్పట్టవచ్చును. ఇందు భాష సుబోధముగ నుండుటకే యత్నించితిని. శకటరేఫార్ధానుస్వారాదులను గమనింపలేదు; విసంధుల స్వేచ్ఛతో వాడితిని; (కేవల వ్యవహారసిద్ధపదములుగూడ కొన్ని ఇందు చేరినవి) అన్యభాషాపదముల విసర్జింపలేదు. (ద్రావిడకుటుంబికమగు తెలుగుకు ఒకవిధముగ సంస్కృతపదములును అన్యభాషవే.) 'సాలు, మామూలు, తయారు, రోజు, ఖాళీ, అమలు, వగైరా, నకలు,' మున్నగు హిందూ

స్థానీపదము లిందువచ్చినవి. కొన్ని చారిత్రక కారణములచే నట్టివి మనవాడుకలో దేశ్యసమములై నిల్చియున్నవి. (కొన్ని శతాబ్దములు మన పైనధికారులై యుండిన గోలకొండ నిజాం రాజ్యపు ప్రజలలో సుమారు సగముమంది యగు అనగా 70 లక్షల ఆంధ్రులు; వారుతమ తెలుగులో నూటికి 70 వరకు వీనినే వాడుచున్నారు.) ఈ పదములు హిందీ బంగాళీమున్నగు ఆర్యభాషల వాఙ్మయములందును దేశ్యములవలె వాడుకలోనున్నవి. ఆంధ్రవాఙ్మయమందును అట్టివానికి నిషేధము తొలగించుట యవసరమనితోచును. సౌకర్యమునుబట్టి బ్యాంకు, స్కూలు, రోడ్డు, స్టీమరు మున్నగు వాడుకలోఉన్న ఆంగ్లపదములును ఆంధ్రపారిభాషికములతోబాటు (పాఠకులకు దెలియదగిన) ఆంగ్ల పర్యాయములును గూడ చేర్చబడినవి. (ఉ. మేమలు, ఫాసిలు, పబ్లికు) యూరపులోని పరదేశనగరాదివ్యక్తినామములిందు వందలకొలదిగలవు; వానిని ఆంధ్రలిపిలోనే వ్రాసితిని. ఆంగ్లమందును వీని యుచ్చారణలో చాల అభిప్రాయభేదములుగలవు. (ఉ॥ సిరాక్యూసు, సైరాక్యూసు). మరియు 'తాటాకు'లో మధ్య అచ్చువలె 'ఆ'కు 'ఏ'కు మధ్యరీతి ఉచ్చారణగలపదము లిందుచాలగలవు; వానికికొంతవరకు క్రింద '_' అను గుర్తునుంచితిని (ఉ॥ ఆథెన్సు,

బ్రౌబరు, ప్యారిసు.) ఇంగ్లీషు 'ఎఫ్' 'జడ్' ఉచ్చారణగల కొన్నిపదములధ్వనికై కొన్నిటికి క్రిందచుక్కను ఉంచితిని, (ఉ॥ ఫ్రాన్సు, ఆఫ్రికా, ఫనీషను, జందవస్తా, నెబూకెడ్ నజ్జార్). మూలపుస్తకపుచివరనున్న ముఖ్యవృత్తాంతకాలక్రమ సూచితోబాటు అదనముగ మరికొన్ని ముఖ్యాంశములుగూడ ఇందు చేర్చబడినవి. మూలముకును టిప్పణికిని భేదము తెలియుటకై టిప్పణుల ముందు '† *' వంటిగుర్తు ఉంచబడి, టిప్పణి సంగతులు మూలముకన్న చిన్న అచ్చులో చేర్పబడినవి. ఆయాకాలపు భూపరిస్థితులను జాతులవ్యాప్తిని చరిత్రాంశములను తెలుపు మూలములోని పటములిందు తెలుగుపేర్లతో వ్రాసి చేర్చబడి, ప్రాచీనభారతదేశపటమును జీవుల క్రమవికాసమును ఆయాయుగములందు కలిగిన పరిణామముల దెల్పువృక్షమును పట్టికయు మన ముఖ్యభాషాకుటుంబములపట్టికయు అదనముగ నీయబడినవి. ఇందలి పటములన్నిటికి శ్రీదేశోద్ధారక విశ్వదాత నాగేశ్వరరావుపంతులుగారు సహజౌదార్యముతో బ్లాకులను తమ ఆంధ్రపత్రికాలయమున చక్కగ తయారుచేయించి నాకుచితముగ నిప్పించి సహాయముచేసిరి; వారికెంతయు కృతజ్ఞుడను. ప్రపంచపు ఆయాదేశముల తారతమ్యస్థితి సులభముగ

పాఠకులకు గోచరించుటకై ముఖ్యదేశము
సంఖ్య, ఆర్థికారోగ్య విద్యాదుల స్థితి
గూడ జాతార్ అండ్ బెరి మున్నగువారి
నుండియు ప్రభుత్వ ప్రచురితపుస్తకాద
వార్షికప్రచురములనుండియు శ్రీ ది.
"భారతదేశ స్థితిగతులు" వ్రాయముతో
నంతవరకు తయారుచేసి గ్రంథాంత
ఆయంకెలపోల్చుటచే ఆయావిషయము
ప్రస్తుతస్థితి, పురోఽభివృద్ధికవకాశము,
టిప్పణిలోని ముఖ్యసంగతులు అనేక గ్రంథ
గ్రహించుటచే ప్రత్యేకముగ ప్రమాణముల ను
లేదు.

మూలమును తర్జుమా చేయుటలోను; ఈపుస్తకపు శైలిలోను అనేకలోపము లుండుటయేగాక, టిప్పణుల లోని కొన్నిసంగతులు వివాదాస్పదములగుటచే, వానిని గూర్చి చాలమంది కభిప్రాయభేదముము లుండవచ్చును. అట్టిలోపములను సహృదయులు చూపినచో వారికి కృతజ్ఞుడను. పారిభాషికపదములతోను వ్యక్తులపేర్లతోను నిండిన ఈపుస్తకమును శ్రీ కాకినాడ ముద్రాక్షరశాలవారు జాగ్రత్తతో ముద్రించిరి; ప్రమాదవశమున ఇందు దూరిన

ప పుస్తకముచివర సవరణపట్టికలో కనుపర్చి
ారము, ముఖ్యముగ అంకెల దిద్దుబాటును,
ాఠకులు ముందుగా చేర్చుకొనప్రార్థన.
ను చిన్నతప్పులు కొన్ని యున్నవి. వాని
సను. ఈపుస్తకమును వ్రాయనారంభించి
వాదము, అంశములసేకరించుట, సాఫు
ము గీయుట, ప్రూఫులు దిద్దుట మున్నగు
చి॥ ప్రతివాదిభయంకరపార్థసారధి బి. ఎ;
. ఎల్. బి. పూర్తిగ సహాయముచేసెను.
వాదముచేసి ప్రచురించుట కనుమతినొసగిన
కిని అందుకొండంబడికను తెప్పించి నన్ను ప్రోత్స
న శ్రీ ఎం. వి.వి.కె. రంగాచార్యులు బి. ఏ. గారికిని
తజ్ఞుడను.

కాకినాడ,
1—7—1935.

కొ. శ.

---

# మూలకర్తపీఠిక.

ఈ చిన్నప్రపంచచరిత్రము నవలను చదువురీతిని సరాసరిగా చదువుట కుద్దేశింపబడినది. వివరములు క్లిష్ట విషయములు లేకుండ, ఇప్పటికి తెలిసియున్న చారిత్రకవిషయముల సామాన్యసంగతు లిందుండును. ఒక ప్రత్యేక యుగము, ఒక ప్రత్యేకదేశచరిత్రమైన, అభ్యసింపదలచు వారి కవసరమగు సామాన్యచరిత్రకజ్ఞానము ఇందు లభించును. ఈగ్రంథకర్తవ్రాసిన "ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ" అను వివరములుగల విపులగ్రంథమును అభ్యసించుటకు ముందు పూర్వప్రయత్నముగ కూడ దీనినుపయోగింపవచ్చును. అయితే, "ఔట్‌లైను"లో వివరముగానున్న చిత్రపటములను కాలవివరములను నేర్చుకొనుటకు తీరుబాటులేక కార్యమగ్నులగువారు మానవజాతి మహాప్రవృత్తినిగూర్చిన మనోభావముల మరల జ్ఞప్తికి దెచ్చుకొనుటకును ఈగ్రంథము ముఖ్యముగ నుద్దేశింపబడినది. ఇది పైగ్రంథపుసంగ్రహముకాదు. "ఔట్‌లైన్" గ్రంథమును దానిపద్ధతినిబట్టి ఇంక సంగ్రహముచేయుటకు వీలే లేదు. ఇది వేరుగా నిర్ణయించివ్రాసిన సామాన్యచరిత్ర.

హెచ్. జి. వెల్స్.

# 1

## విశ్వమున భూలోకపుస్థానము.

మన జగత్తు పూర్వపుస్థితి ఇంకను పూర్తిగ తెలియదు. రెండుశతాబ్దముల క్రిందటివారికి గడచిన మూడు వేలయేండ్ల చరిత్రమాత్రమే తెలిసెను. అంతకుపూర్వపు సంగతులకు, గాథలు ఊహాలునే ఆధారమయ్యెను. చాల వరకు నాగరికులీ ప్రపంచము క్రీ. పూ. 4004 వయేట హఠాత్తుగా సృజింపబడెనని నమ్మిరి; అది ఆసాలు వేసవినా, లేక శరదృతువునా, అని మాత్రము విద్వాంసులు చర్చించుచుండిరి. వారు † హీబ్రూబైబిలులో కొన్నిమాటలకు కేవలశబ్దార్థమునే గ్రహించి, అందుపై విచక్షణలేని మత నిర్ణయముల జేసిరి; అందుచే, ఇట్టిఅసందర్భపు అపోహాలు కలిగెను. మతబోధకులు నిట్టిభావముల వదలి చాలకాల

† 'హీబ్రూ' యూదదేశపు ప్రాచీనభాష. ఏసుక్రీస్తు యూద వంశజుడు, యూదదేశమందే తన నూతనమతము స్థాపించెను. అందుచే బైబిలంతయు మొదట హీబ్రూలోనే రచింపబడెను. ప్రపంచ మిట్లు హఠాత్తుగా ఇటీవలనే సృజింపబడెనను భావము యూద క్రైస్తవ మహమ్మదీయులలోనే పూర్వముండెను. అనేకయుగములనుండి కల్పములనుండి కూడ ప్రపంచము కలదనియే ప్రాచీనహిందువులు బౌద్ధులు నమ్మిరి. హిందువులు వైదికకార్యములందుజేయు సంకల్పమంత్రములో గూడ ఈసనాతనత్వము అనుదినము జ్ఞప్తికితేబడుచుండును.

మైనది. మనమున్న యీవిశ్వమతిదీర్ఘకాలమునుండి ఉన్న దనుట సర్వసమ్మతము. (అది అనాదికావచ్చును) ఒకగదిలో ఎదురెదురుగ నద్దముల బెట్టుచో, ప్రతిబింబములచే నాగది యనంతమని భ్రమకలుగును; అట్లే, ప్రపంచపు బాహ్యదృశ్యము కొంత మాయగా గన్పడును. మనజగమా రేడువేలయేండ్లనుండి మాత్రమున్నదనుట కేవలము నిరాధారము.

మనభూమి గోళప్రాయమై నారింజపండువలె కొంచె మదిమినట్లుండును. దానివ్యాసము రమారమి 8000 మైళ్లు. అది గోళరూపమని కొద్దిమంది ధీమంతులకుమాత్రము రమారమి 2500 యేండ్లనుండియు దెలియును. కాని అంతకుపూర్వికులు అది బల్లపరుపని తలచిరి. భూమికి గ్రహనక్షత్రములతో నుండు సంబంధమునుగూర్చి అనేకవిచిత్రభావము లుండెను. భూమివ్యాసము, భూమధ్యరేఖకన్న ధ్రువములయొద్ద 24 మైళ్లుతక్కువ. భూమి తన అక్షముపై 24 గంటల కొకసారి తనచుట్టుతిరుగును; అందుచే గ్రమముగా రాత్రి బవలు కలుగుచుండును. కొంచెము కోలయగుకక్షలో భూమి సాలుకొకసారి సూర్యునిచుట్టి వచ్చును; (ఈమార్గమే దానిక్రాంతివృత్తము.) దానికి సూర్యు డతిసమీపమైనపుడు 915 లక్షలమైళ్లు, అతిదూరమైనప్పుడు 945 లక్షలమైళ్లు దూరముండును.

చంద్రుడు భూమికన్న చాలచిన్నదై, సుమారు 2,39,000 మైళ్లదూరమున భూమిని చుట్టివచ్చుచుండును. భూచంద్రులేకాక, బుధుడు 360 లక్షలమైళ్లదూరమున, శుక్రుడు 670 లక్షలమైళ్లదూరమున, మఱియు భూవృత్తమున కావలనున్న అంగారక, బృహస్పతి, శని, అరుణ, వరుణులు వరుసగా సుమారు 1410 లక్షలు, 4830 లక్షలు, 8860 లక్షలు, 17,820 లక్షలు, 27,930 లక్షలు మైళ్లదూరమున సూర్యునిచుట్టు దిరుగుచుండును. ఇట్లే ఇంకను చాల అల్పగ్రహములును తిరుగుచున్నవి. ఈకోట్లకొలది మైళ్లదూరము మనకు దురవగాహము. అందుచే ఈగ్రహములన్నిటిని చిన్నస్కేలు (పరిమాణము)లో భావించిన, ఆదూరము బోధపడును.

భూమి నొక అంగుళపువ్యాసముగల చిన్నబంతిగా ఎంచుము. అప్పుడు సూర్యుడు 9 అడుగులవ్యాసము గలిగి, 323 గజముల (అనగా నాలైదు నిముసముల నడకపట్టు 1/5 మైలు)దూరమున ఉన్నట్లగును. అప్పుడు చంద్రుడు, మనభూమికి $2\frac{1}{2}$ అడుగులదూరమున, ఒకచిన్న బఠాని గింజంత యుండును. సూర్యునికి వరుసగా125,250 గజముల దూరమున, (భూసూర్యులమధ్య) బుధుడు, శుక్రుడు నుండును. ఇక వీటివెలుపల చుట్టును ఖాళీగానుండును; భూమికి

ఆవల 175 అడుగులదూరమున అంగారకుడు, రమారమి నాలుదూరమున ఒకఅడుగు వ్యాసముతో బృహస్పతి, ఇంకగొంచెము చిన్నదై రెండుమైళ్లదూరమున శని, నాలుగు మైళ్లదూరమున యూరేనసు (అరుణుడు) ఆరుమైళ్ల దూరమున నెప్ట్యూను (వరుణుడు) నుందురు. వీటికావల (ఈస్టేలు ప్రకారమును) వేలకొలది మైళ్లవరకు చిన్న నలుసులు, ఎగయు ఆవిరి పొగయు దప్ప, అంతయు శూన్యముగ నుండును. అతిసమీపమగు నక్షత్రము ఈపరిమాణమున భూమికి నలుబదివేలమైళ్ల దూరమందుండును. జీవనాటకరంగస్థల మెంతవిశాలమో ఈపై అంకెలచే గొంత వరకు తెలియును. మహావిశ్వమంతటిలోను, నిశ్చయముగా ప్రాణులుండుట మనభూతలమునమాత్రమే. భూతలముకు భూగర్భమధ్యముకు ఉన్న 4000 మైళ్లదూరములో పైనుండి మూడుమైళ్లలోతువరకు, వాయుమండలములో అయిదుమైళ్లయెత్తుకును మాత్రమే, ప్రాణులుండును; మిగిలిన అనంతవిశ్వమును నిర్జీవమై, శుద్ధశూన్యముగ గన్పట్టును. మహాసముద్రమున 5 మైళ్లలోతుమాత్రము గమనింపగలము. ఇప్పుడు గాలియోడలపై ఆకాశమున సుమారు 4 మైళ్లయెత్తుకు మాత్ర మెగురగలము. బెలూనులో 7 మైళ్లయెత్తుకు నను లతిశ్రమపై వెళ్లగలరు;

5 మైళ్లయెత్తున కెట్టిపక్షియు వెళ్లలేదు; గాలియోడలనంటి చిన్నపక్షులు, పురుగులు పోవుచో, ఆయెత్తులోపుగనే స్పృహతప్పి క్రిందబడును. †

---

† విమానములపై సుమారు పది, పన్నెండు మైళ్ల యెత్తునకు గూడ నిటీవల కొందరు (ముఖ్యముగా రష్యనులు అమెరికనులు) కష్టముపైన వెళ్లగలుగుచున్నారు. కాని అంతకన్న యెత్తునకు వెళ్లుటకును, ఇతరగోళములతో మరియేరీతిగాను వార్తలను సంజ్ఞలను బంపుటకును గ్రహించుటకునుగూడ ఎవరికిని ఇంకను సాధ్యపడుటలేదు. మిగిలిన విశ్వము నిర్జీవముగ గన్పడుననుటలో ఇంకెక్కడను ప్రాణులుండవని శ్రీ వెల్సుగారి అభిప్రాయము కాదు. భూమి కావల అనంతమహావిశ్వమందు ప్రాణిచిహ్నములు మనకు గన్పడక పోవుట, మన యల్పజ్ఞతను మాత్రమే సూచించును. మన కతిసమీపగ్రహమగు అంగారకునందే నరులున్నారని, లేరని, జరుగు చర్చ యింకను సరిగా తేలలేదు; పైనచెప్పినవి కాక ఇందులో సుమారు 2400 అల్పగ్రహములు, వరుణున కావల 'ప్లూటో' అను ఇంకొకగ్రహమునుగూడ, సౌరకుటుంబములోనే కలవు; ఈ సౌరగ్రహముల స్థితినిగూర్చియు, మనకు స్పష్టముగా దెలియదు. ఆకాశమున గనబడు నక్షత్రములలో అనేకములు మన సూర్యగోళముకన్నను చాల పెద్దవి. సూర్యునివంటివి ఇంకను పెద్దవి సుమారు మూడువేలకోట్ల మహాగోళములు కలవని బలీయమగు దూరదర్శినులద్వారా లెక్కింపబడినది. అవి అసంభావ్యదూరమున నుండుటచే, మనకు మిక్కిలి చిన్నవిగా గన్పడును. మన బుధశుక్రభూమ్యాదుల వలె చుట్టుతిరుగు గ్రహములు (వాటికి మన చంద్రునిబోలు ఉపగ్రహములు) వీటికిని ఉండును. మనకతిదూరమగు ఖగోళకాంతి మన భూమిని చేరుటకు 14 కోట్ల యేండ్లుపట్టునట. (కాంతి సెకండుకు అనగా క్షణమునకు 1,86,000 మైళ్లచొప్పున

విద్యుద్వేగమున బోవుచుండును.) మన కతిసమీపములని తోచునక్షత్రములుకూడ అర్బుదములకొలది మైళ్లదూరమున నుండును; ఇందుచే మనకు గోచరించుమహావిశ్వ మెంత విస్తీర్ణమైనదో యూహింపవలెను. ఇదంతయు బలీయమగు దూరదర్శనికి దృశ్యమగునది; దానికిని అందనిది ఇంకను మూడురెట్లు మహావిశ్వముండునని జ్యోతిశ్శాస్త్రజ్ఞులలో అగ్రేసరుడగు ఈన్‌స్టీనుమహాశయుడు తెలిపెను. ఈ నిర్వచనము "పాదోఽస్యవిశ్వాభూతాని...త్రిపాదూర్ధ్వ ఉదైత్ పురుషః" (ఋ. సం. 10 వ మండలం) అను పురుషసూక్తవచనమును జ్ఞప్తికి దెచ్చును. ఇట్లే పదార్థముల సూక్ష్మతయు దుర్గ్రాహ్యము. అభేద్యమని తలపబడిన పరమాణువుకూడ, ఒక గ్రహకుటుంబమువలె, అనేకసూక్ష్మతమపదార్థముల పుంజమని, ఇటీవల దెలియవచ్చినది. ఒక్కొక్క పరమాణువులోని సూక్ష్మతమపదార్థములలోను, అర్బుదముల కొలది మైళ్లదూరమున మహావిశ్వమున ఆవరించిన మహాలోకములచుట్టును గూడ, ఏదో అప్రమేయమగుమహాశక్తి వ్యాపించి, వాని స్థానములందుండున ట్లాకర్షించి నియమించి యుంచుచున్నది. "తమేవభాంత మనుభాతి సర్వం, తస్య భాసా విశ్వ మిదం విభాతి" (శ్వే. ఉ. 6-14) ఆశక్తిస్వభావమెట్టిదో, ఎట్లు కలుగునో, ఎందుండివచ్చుచున్నదో, వైజ్ఞానికులకింకను తెలియలేదు. ఈశక్తి "అణో రణీయాన్, మహతోమహీయాన్" (క. ఉ.2-20) అనియు "యస్మాత్పరం నాపరమస్తికించిత్; యస్మాన్నాణీయో నజ్యాయోఽస్తికశ్చిత్" (శ్వే. ఉ. 3-9) అనియు ఉపనిషత్తులలో వర్ణించిన సర్వాంతర్యామియగు పరమాత్మకు సంబంధించినదేమో! ఇట్లు విశ్వమంతటను చిద్రూపశక్తి లీనమై వ్యాపించియున్నదని ఊహింపవచ్చును. (కొన్నిచోట్ల కొన్ని లోకములు క్షీణించుచుండ మరికొన్ని క్రొత్తలోకము లేర్పడుచున్నవి. ఇట్లు సృష్టిస్థితిలయములు నిరంతరము కలుగుచున్నవి.) అట్టిచో భిన్నభిన్నపరిస్థితులుగల అసంఖ్యాకములగు గోళములు అర్బు

పేములకొలది మైళ్ళదూరమునుండ, దిక్కాలమితి లేని యీ మహావిశ్వమంతటిలోను, మనభూమిలోతప్ప ఇంకెక్కడను జీవములు లేవనుటకు వీలులేదు. మనగోళపుపరిస్థితులున్న నే ప్రాణులుండుననుటకును వీలు లేదు. మనభూలోకమందే, అతిశీతలస్థలములందు, అత్యుష్ణప్రదేశములందు, వాయుమధ్యమునందు, సముద్రములో మైళ్ళకొలదిలోతున, ఆ దేశకాలపరిస్థితులకు వీలగు దేహములుగల చిత్రవిచిత్రమగువివిధప్రాణులు కలవు. ఇప్పుడు భూమిపైలేని రకముల అద్భుతప్రాణులు పూర్వయుగములందు మన భూమిపై నుండినట్లు స్పష్టనిదర్శనములు కలవు. ఇట్టే గోళాంతరములందును ఉండవచ్చును. సృష్టివైచిత్ర్య మత్యద్భుతము.

---

8



## జగత్కాలము.

మనభూమి ఎప్పు డేరీతి జనించినదో, వైజ్ఞానికులు చక్కగ విమర్శించినారు. ఈ క్లిష్టగణితపరిశోధనల నిందు వివరింపవీలు లేదు. భౌతికజ్యోతిశ్శాస్త్రములింకను బాల్యావస్థలోనేయున్నవి. మన మింకను సూచనలతోనే తృప్తి పొందవలెను. మనభూమి వయఃకాలపు అంచనా క్రమముగా హెచ్చుగుచున్నది. అదిసూర్యునిచుట్టు తిరుగు ప్రత్యేకగ్రహముగా ఏర్పడి, సుమారు 200 కోట్ల యేండ్లైయుండును; ఇంకను హెచ్చుకావచ్చును. ఈకాలపరిమితి మన కగ్రాహ్యము. ఈకల్పమున కింకను పూర్వమున మనభూమి, సూర్యుడు, సౌరకుటుంబము అంతయు కలసి అంతరాళమున మిశ్రితమై పల్చని మహాపదార్థముగా వ్యాపించి యుండును. మహాకాశమం దక్కడక్కడ ఇప్పటికిని అట్టికాంతిమంతమగు పదార్థసంఘాతము ఏదో కేంద్రముచుట్టు తిరుగుచు మబ్బువలె నుండుట దూరదర్శనియంత్రముచే కనబడును. దానినే 'నెబ్యులా' అనగా తేజోమేఘము అందురు. మన సూర్యుడు గ్రహములుగూడ పూర్వ మొకప్పు డీరీతినే లఘుద్రవ్యపుంజముగనుండ, క్రమముగా అందుకొన్ని భాగములు అసలుకేంద్రమునుండి తీగతీగలుగా ఊడి, విడి

పోయి దూరమై, దేనికది వేరుగా ఘనీభవించి, క్రమముగా ఇప్పటిరూపుల నొందియుండునని, చాలమంది జ్యోతిశ్శాస్త్రజ్ఞులభావన. ఇట్లనేకకల్పములుగా ఘనీభావము జరిగిన మీదట, చివరకు మనము పైనచెప్పియున్న ఈకల్పాదికి మన భూమి, చంద్రుడు, తమతమ వ్యక్తిత్వమును బొందియుండును. అప్పటిగ్రహము లిప్పటికంటె సూర్యునికింకను దగ్గరనై, ఇంతకన్న అతివేగముగ సూర్యునిచుట్టివచ్చుచుండెను. వాటి పైభాగము లుజ్జ్వలమైయుండెను; అంతరిక్షమందు సూర్యతేజ మత్యుగ్రముగనుండెను. ఆయాదికాలపుభూమి యత్యుష్ణమై ఉక్కుగరగించు కొలిమినో, అగ్నిపర్వతగర్భమునో పోలియుండెను. అందలి లోహగంధకాదులు గూడ ఆవిరిగనుండెను. అప్పటికి జల మగుపడదు. ఇక భూగర్భపు శిలావస్తువులన్నియు మహాద్రవముగ ఉడుకుచుండెను.అంతరిక్షమున ఆగ్నేయాస్త్రములబోలు మేఘము లావరించెను. మనోవేగమున బరువెత్తు అప్పటి సూర్యచంద్రుల మహాతేజమతిశీఘ్రముగా అన్నిదిశలను వ్యాపించియుండును. ఇట్లొక్కొకయుగము గడచినకొలది ఆయాగ్నేయలోకపుఉగ్రతేజము తగ్గుచుండ, ఆవిరి వస్తువులు చల్లబడి వర్షింప, వాతావరణము కొంత తేలికయయ్యెను. భూతలమును క్రమముగా ద్రవస్థితిపిడి ఘనీభవించెను. అందుచే నేర్పడు

శిలలు † వెంటనే మహాద్రవసముద్రమునమునిగి, భూగర్భ గతము లగును. అప్పటికి సూర్యచంద్రులు వెనుకటికన్న భూమికి దూరమై చిన్నవగుచుండె; అంతరిక్షమున వాని గమనవేగమును తగ్గియుండును. చంద్రబింబ మితరగ్రహములకన్న చాలచిన్నది, అందుచే చంద్రకాంతి తీవ్రత బొత్తిగాతగ్గెను. గ్రహణకాలములందు చంద్రుడు సూర్యకాంతిని భూమిపై ప్రసరింపజేయుచుండెను. ఇట్లనేక యుగములు గడచినమీదట, పృథివి క్రమముగా మన ప్రస్తుతభువిగా ఏర్పడినది. ఆవిరి చల్లగాలికి మేఘాకృతినొందె; భూమిపై నీటివర్షము పడనారంభించెను. ఇంకను వేలకొలది యేండ్ల వరకు నీరు చాలవరకావిరిగనేయుండెను; కాని అక్కడక్కడ శిలలపై వెన్నీటిసెలయేళ్ళు ప్రవహించుచుండెను; ఈనీరును వాటితోవచ్చు ఇంద్రను పల్లపుభాగములలో జేర, గుంటలు సరస్సులు ఏర్పడియుండును.

ఇట్లైన భూమిపై తుదకు నరుడు నిల్చి చరింపగల్గెను. మన మాకాలమునకు భూమికి విచ్చేసినచో, అప్పుడు ఇంకను మట్టినేల వృక్షజాతి లేక, కేవల మాగ్నేయ శిలలపై నిల్చియుందుము. అంతరిక్షమున తుపాను, తీవ్ర

† 'శిల' అనుపదమును ఇచటను ఇకముందును, 'రాయి' అనియే గాక గట్టిపడిన మట్టి గంధకము మొదలగు ఇతరఘనపదార్థములు అనియు భావము.

ఝంఝామారుతములు, ఊహాతీతమగువర్ష సంపాతము, భీకరముగ మనపై చెలరేగియుండును. ఈ యాసారనిర్ఝరములు మన ప్రక్కనుండి శిలల వండ్రుతో లోయలగుండ ప్రవహించి, సెలయేళ్లై, కూలంకషముగా ఆనూతనసముద్రములజేరి, తాము తెచ్చిన భూసారము నందు జేర్చుచుండును. సూర్యబింబపుచలనము మేఘములగుండ ప్రత్యక్షగోచర మగుచుండెను. అంతతో రోజుకు రెండుసార్లు భూచలనము, భూమి ఉత్క్షేపము, ఆటుపోటులవలె కలుగుచుండియుండును. ఇప్పటివలెగాక అప్పటి చంద్రబింబము రాత్రులం దవిచ్ఛిన్నముగ నగుపడియుండును. భూమివయస్సు గడచినకొలది దినపరిమాణము వృద్ధియయ్యెను; రాను రాను సూర్యుడు దూరమగుచు, ఆదుర్భరకాంతితీవ్రత తగ్గుచుండెను; చంద్రగతియు మందగించెను. తుపాను ఉద్రేకముతగ్గి సముద్రజలము వృద్ధియగుచు, భూతలముపై వ్యాపించి క్రమముగా నిప్పటి మహాసముద్రాకృతి నొందియుండును. కాని అప్పటి కింకను భూతలముపై జీవస్వరూపము లేదు. ప్రాణిహీనములగు నదీసముద్రములు, వంధ్యశిలలుమాత్రము ఉండెను †.

---

† ఆకాలమున కింకను భూస్థలి సరిగా గట్టిపడలేదు. సూర్యచంద్రు లిప్పటికన్న భూమికి చాలదగ్గరయై వాటి ఆకర్షణబల మధికముగ నుండెను. అందుచే భూస్థలికే ప్రతిదినము చలనము ఉత్క్షేపము

కలుగుచుండియుండును. ఇప్పటికిని ద్రవపదార్థము సముద్రమునకు దాదాపు అన్లే అగుచున్నది.

ఈభూలోకము ప్రత్యేకవ్యక్తియై ఇప్పటికి సుమారు 200కోట్ల యేండ్లై యుండునని పైనచెప్పినది ఆధునిక వైజ్ఞానికుల సిద్ధాంతప్రకారము. మన ప్రాచీనభారతీయుల లెక్కప్రకారము చూతము; ఇప్పుడీకల్పములో 6 మన్వంతరములు గడచి, 7 వ దానిలో 28 వ మహాయుగము జరుగుచున్నది. ఆప్రకారము ప్రతిమహాయుగములో—

| | | |
|---|---|---|
| కృతయుగముకు | 1728000 | ఏండ్లు |
| త్రేతా ,, | 1296000 | ,, |
| ద్వాపర ,, | 864000 | ,, |
| కలి ,, | 432000 | ,, |
| చతుర్యుగము అనగా ఒక మహాయుగముకు | 4320000<br>71 | ,, |
| మన్వంతరము అనగా 71 మహాయుగములు | 306720000<br>6 | ,, |
| ఇప్పటికారు మన్వంతరములు గడచి ఏడవదగు వైవస్వత మన్వంతరమున ఉన్నాము కనుక 6 మన్వంతరములకు, | 1840320000 | ,, |
| ఈ 7 వ మన్వంతరములో ~~దాని 28 వ మహాయుగము~~ గడచిన 27 మహాయుగ ~~లో కృత త్రేతా ద్వాపర యుగములకు~~ మొత్తం. | 116640000 | |

| | | |
|---|---|---|
| ఈ28వ మహాయుగములో కృత త్రేతా ద్వాపర యుగములకు | 38880000 | ,, |
| ఈకలియుగములో ఇప[illegible]రి కైనవి | 5035 | ,, |
| మొత్తం ఈకల్పంలో అయినయేండ్లు | 1995845035 | ,, |

ఇట్లు మన ప్రాచీనార్యసంప్రదాయపు లెక్క ప్రకారము ఈ కల్పారంభ కాలము మనభూమికి ప్రత్యేకవ్యక్తిత్వ మేర్పడుటకు వైజ్ఞానికులు చెప్పిన కాలముకు సుమారుగా సరిపోవును. భూమియేర్పడి ఈ 200 కోట్ల ఏండ్లకన్న ఇంకను చాలరెట్లు హెచ్చుకాలమై యుండునని కొందరు ప్రతిభావంతులగు భౌతికజ్యోతిశ్శాస్త్రజ్ఞులు భావించుచున్నారు. అట్లగుచో భూమి ఆరంభించి అనేక కల్పములై యుండును.

భూమి ఉత్పత్తిక్రమము ఈఅధ్యాయమున సుప్రసిద్ధమగు నెబ్యులార్ (తేజోమేఘ) సిద్ధాంతమును బట్టి చెప్పబడినది. తేజోమేఘములు లఘువుగను ఉష్ణముగను నుండును. వానిచుట్టు అతిశీతముగ నుండును; అందుచేత తేజోమేఘ మతిస్వల్పకాలముకే తనఉష్ణమంతయు కోల్పోయి అంధకారబంధురమగునని, చాలబలువగు మనభూమి సూర్యసమమున్నగు మహాగోళము లాకీతిగాయేర్పడియుండవని, కొందరిమతము. ఆరంభస్థితిలోనే భూమిపై హిమ మావరించిన చిహ్నములు కలవు; అందుచే భూతలము అత్యుష్ణతనుండి క్రమక్రమముగానే చల్లబడుచువచ్చినదనుటకు వీలులేదని వీరందురు. సూర్యగోళముయొద్ద దానిచుట్టు అర్బుదముల కొలది ఉల్కలు సదా తిరుగుచుండును. ఇట్టి ఉల్కలాకాశమందంతట నుండునని తోచును; భూమిపై ప్రతిరాత్రియు ఉల్కలనేకములు పడుచుండుట మనకు కనబడును. ఈఉల్కలపదార్థము ఇనుపగనులలోని

పొడివలె చాలవరకు ఇనుముగను కొంచెముగ నిక్కెలు, మట్టి, నీరు, వాయువు వగైరాలు కలసి యుండును. భూమిలోపలిభాగముచాలవరకు ఇనుమే అయియుండునని భూమి తూనిక[illegible]లచే తేలినది. దానిపైన మట్టివగైరాలున్న సంగతి అందరెరిగినదే. సూర్యగోళమును ఉల్కాపదార్థమై ఉండును; దానిచుట్టు తిరుగుకొన్నికోట్ల ఉల్కలు తేజోమేఘములమధ్యనో, దిగంతరాళపు ఇతరపదార్థములలోనో, తగుల్కొనియుండును: లేక సూర్యగోళపు పైభాగము మహోష్ణముచే ప్రేలి ఉల్కలు దూరముగ నెగురగొట్టబడియుండును; లేదా ఏదైన మహానక్షత్రము సూర్యగోళసమీపముగ పోయినప్పుడు, దాని ఆకర్ష బలముచే ఆఉల్కలలో కొన్నికోట్లు సూర్యపరిధినుండి ఈవలకు దూరముగ లాగబడియుండవచ్చును; ఇట్లు సూర్యునినుండి ఈవలబడిన ఉల్కాసమూహము వేగముగ తిరుగుటలో సంఘర్షణముచే కరిగి గట్టిముద్దకాగా, అందలి లోహపదార్థము బరువుచే లోనికిదిగి 7900 మైళ్ల వ్యాసముగల గోళముగ భూమిలో ఏర్పడగా, అందుపైన సుమారేబది మైళ్లలోపు మాత్రమే మందముగల పెచ్చుగా శిలలు మట్టి ఏర్పడి యుండునని, నీరును గాలియు లోహశిలాదులకన్న లఘువగుటచే పైకి తేలియున్నవని, వీరి యూహ. ఇదియే 'మీటియరైట్' (ఉల్కా) సిద్ధాంత మనబడును. చంద్రుడును ఇట్లే భూమిలో ఒకపెద్ద ముక్క (బహుశః శాంతమహాసముద్ర ప్రాంతపుది) చెదిరి దూరముగ పోవుటచే నేర్పడి అప్పటినుండి భూమి యాకర్షణబలముచే దానిచుట్టు తిరుగుచున్నదనియు వీరు చెప్పుదురు.

భూమికన్న సూర్యుడు ప్రాచీనుడు; కొన్ని నక్షత్రగోళములింకను పూర్వపువట; అందుచే నః భూమి యేర్పడుటకుపూర్వమే అనేకకల్పముల నుండి విశ్వమున సృష్టిస్థితిలయములు జరుగుచునేయున్నవి.

సూర్యతేజ మొకప్పు డింకను చాలఉగ్రముగ నుండెనని, విశ్వకర్మ ఆ ఉగ్రతను తగ్గించెనని, మనలో ఒకఐతిహ్యము కలదు.

ఇట్లు భూమి [illegible] కొంతకాలమునకు అందు జీవారంభము కలిగెను. ఈపురాతనప్రాణుల సంగతి వాని క్రమపరిణామము అతిప్రాచీనములగు శిలాజీవశేషములవల్లనే తెలియవచ్చునని ముందు తెలుపబడును. అందుచే ఆశిలాజీవములన నేమియో యిక్రింద తెలుసుకొందము. ఈ మొదటి మన్వంతరములలోని పూర్వయుగములందుండిన వివిధములగు చరాచరప్రాణులు కాలక్రమమున నశించియో లేక హఠాత్తుగా భూకంపాదిప్రమాదములవల్లనో మట్టిపొరలచే కప్పబడుచుండును. వాయుమండలపు ధూళియేగాక, అంతరిక్షమందుండు వేలకొలది ఉల్కలు ప్రతిదినమును భూతలముపై బడుచుండుటచేతను, అగ్నిపర్వతములనుండి పడు శిలాద్రవములవల్లను, ఇతరకారణములవల్లను, మనభూస్థలము క్రమముగా పెరుగుచువచ్చినది. (అట్టి ఉల్కాపాతము నేటికిని ఆకాశమున రాత్రివేళల మనము గమనింపవచ్చును.) పూర్వయుగముల చరాచరప్రాణుల దేహశేషము లీమట్టిపొరలక్రింద అణగిపోయి, ఘనీభవించుచు, వాటిలో నిమిడి శిలాధాతువులుగా నేర్పడెను. పూర్వయుగముల జీవజాలములు క్రిందిపొరలలోను, దరిమిలాయుగములవి వాటిపైపొరలలోను, లగ్నములై యుండుట సహజము. అట్లణగియున్న తరుమృగాదుల శరీరములోని మృదుపదార్థములు కొంతకాలమునకు పూర్తిగా నశించును; కాని వాటిస్కంధములు, ఎముకలు, పళ్ళు మొదలగు దృఢభాగములు మాత్రము నశింపక నేయుండును. అయితే వేలకొలదియేండ్లవి గాలి వెలుతురు లేక, పైనుండు బలువుచే అణగిపోయి, సూక్ష్మరూపములై, వివర్ణములై, కొంతవికృతాకారమొందును. (ఉ. పూర్వయుగములందలి మహావృక్షశేషములే ఇప్పటి గనులలోని నేలబొగ్గుగా నేర్పడినవి.) ఈపురాతనశిలలను బలీయమగు సూక్ష్మదర్శనియంత్రములద్వారా పరీ

క్షింతుమేని, ఆయాయుగములం దేర్పడిన పొరలును, అందిమిడియున్న పురాతనప్రాణుల దేహశేషములును గోచరించును. ఈలక్షలకొలది యేండ్లమధ్యను అనేకప్రకృతిశక్తులును [illegible]ములును ఈశిలలలోని పొరలసహజస్థితిని కొంతమార్చుచుండును. అందుచే విశేషశాస్త్రజ్ఞానము అనుభవము కలిగి నిరంతరము వస్తుపరీక్ష జేయువారే ఆసంగతులు సరిగా గ్రహింపగలుగుదురు. ఆదేహశేషములవల్లనేగాక, అప్పటిప్రాణుల చలనముచే నేలపై నేర్పడు చిహ్నములబట్టియు, అప్పటికొన్ని సంగతుల గ్రహింపవచ్చును. ఈశిలలలోని దేహశేషములే ఇంగ్లీషులో "ఫాసిలు" లనబడును.

---

## 3

## జీవారంభము.

ఘనీభవించిన మహాశిలల పొరలందున్న ప్రాచీన దేహాశేషముల పరీక్షచేతనే, నరులకుపూర్వపు జీవుల సంగతి మన కిపుడు తెలిసినది. పురాతనమగు డిప్పలలో, రాతిపలకలలో, గులకరాళ్లలో, ఇసుకరాళ్లలో, జంతువులనరములు, పైడిప్పలు, తిత్తులు, కాడలు, పళ్లు, పాదచిహ్నములు, సంఘర్షణము మొదలగు జీవచిహ్నము లిమిడియుండును. మొదటివానల యానవాళ్లు, అప్పటి సముద్రములపోటు, కెరటముల రేఖలుగూడ, ఇందు కుపయోగించును. ఈమహాశిలలపొరలనుండి గ్రహించిన సంగతులవలననే, మనభూమిపూర్వచరిత్ర ఏర్పడినది. అణగియున్న యీశిలలపొరలు వరుసగానుండక, చాల సారులు లూటీయై తగులబెట్టిన గ్రంథాలయపు పత్రముల వలె నలిగి, వంకరయై, చెదరి, విరూపమై, మిళితమై, విచ్ఛిన్నమై యుండును. అందుచే సమర్థులగు పరిశోధకు లనేకులు తమ యావజ్జీవము శ్రమపడి, వీటిచరిత్ర కను గొని, సరిచేసి సమకూర్చిరి. ఈ శిలాచిహ్నములందు, 160 కోట్ల యేండ్లస్థితి యిమిడియున్నదని నిర్ణయింపబడినది.

మొదటిశిలలలో జీవచిహ్నలేమియు లేనందున, అట్టివానికి, 'అజీవశిల'లని భూతత్వజ్ఞులు పేరిడిరి. ఉత్తర

అమెరికాలో ఇట్టి మహాశిలలు కలవు. ఈ శిలల దళసరి బట్టిచూడ, అట్టి వేర్పడుటకు మొత్తము భూచిహ్నకాల మగు 160 కోట్లవత్సరములలో సగము పట్టియుండును. అనగా ధరాసముద్రములు విడిగా ఏర్పడినతరువాత జరిగిన మన్వంతరములం దర్ధకాలమువరకు జీవులుండినచిహ్నము లే కనబడవు. ఈశిలలపై తరంగరేఖలు, వర్షపాతచిహ్నము లునేకలవు. కాని ప్రాణులుండిన సూచనలేదు. తరువాత జీవ చిహ్నములువచ్చి, క్రమముగా అట్టి వధికమగును. ఆ ప్రథమప్రాణులకాలమునకు "పురాణజీవ" యుగమని భూ తత్వజ్ఞులు పేరిడిరి. ప్రథమజీవులసూచించు అల్పప్రాణుల దేహశేషము, డిప్పలు, సముద్రపుమొక్కల కాడలు, బొడి పెలు, నాచు, సముద్రక్రిమిశేషములు, అప్పటివి.

ఆయుగమున ప్రాకుచు వలయాకారముగ దొర్లు కొన్నిచీడపురుగులు పుట్టెను. తరువాత కొన్నిలక్షలయేండ్ల కా మొదటిప్రాణులకన్న హెచ్చువేగబలములుగల సముద్ర పుతేళ్ళు బయలుదేరినవి. ఇవియు నంతగా పెద్దవికావు. వీని లో చాల పెద్దవి తొమ్మిదడుగుల పొడవువి. అప్పటికి భూత లమున వృక్షజంతుజాతులు లేవు. నీటిలోగూడ ఇంకను చేపలుమున్నగు వెన్నెముకగల జంతువులు లేవు. ఆప్రా ణులచిహ్నములు లోతులేని నీళ్ళనుండి, ఆటుపోట్లు కలుగు

స్థలములనుండి దొరికినవి. శిలలగుంటలందు పాతగోతుల లోను ఉండు నిలువనీటిముక్కను సూక్ష్మదర్శనితో పరీక్షించుచో, అందు గోచరించు ప్రాణులును, పైనజెప్పిన ప్రాణులును, ఒకేజాతివని తెలియును; పరిమాణమున మాత్రము భేదముండును.

అయినను మనభూమిపై మొదటనుండిన ప్రాణుల రకములన్నియు ఈ పురాణజీవశిలలలో కన్పడునన వీలు లేదు. ఆప్రాణిజాతిశరీరమున, ఎముకలు డిప్పలవంటి ధృఢపదార్థములు ఉండినవో, లేక బురదనేల నవి చరించునపుడడుగుల ఆనవాలు పడునంత పెద్దవై బలువైనవైననో తప్ప, అట్టిజంతుచిహ్నము లేవియు శిలాపరీక్షచే లభింపవు. ఇప్పటిజీవరాసులలో మృదుశరీరముగల లక్షలకొలది చిన్న జంతుజాలములు కలవు. అట్టిజంతుజాతులచిహ్నము భావి వైజ్ఞానికులకు దొరకదు. పూర్వయుగములందును అట్టి జంతుజాతులు కోట్లకొలది భూమిపై జీవించి వృద్ధియై గతించియుండును; కాని వాటిస్థిరచిహ్నములు భువిపై మిగులలేదు. అజీవయుగ మను ఆదికాలపు గాధసరస్సముద్రముల వెచ్చనినీటిలో, ఎముకడిప్పలు లేని మెత్తమెత్తని రకరకముల చిన్నపురుగులు మొక్కలు జీవించి, తీవ్రాతపముగల తీరములవెంట వ్యాపించి యుండును. ఈకాలపు

మన బ్యాంకుల లెక్కలవల్ల ఇప్పటిప్రజలందరిసంగతి తెలియదు; ఆబ్యాంకురికార్డులో వ్యవహారముకలవారి విషయముమాత్రమే తెలియును. అట్లే అప్పటినేలపై డిప్పలు సున్నపుగుల్లలువంటి స్థిరచిహ్నము లేర్పడిన జంతుజాతుల సంగతి మాత్రమే మన కిపుడు తెలియవీలగును.

ఇట్టిస్థిరచిహ్నములుగల దృఢశిలలకన్నను ప్రాచీనములగు శిలలు కొన్ని కలవు. వీనిలోని బొగ్గులు దృఢముగనుండక విచ్చిపోయియున్నవి. మనకు తెలియనికొన్ని జీవు లాబొగ్గుల శిలలుగాకుండునటు వేరుచేసి యుండునని కొందరు ప్రామాణికుల భావము. †.

---

† అజీవయుగపు అతిపురాతనశిలలు మనదక్షిణభారతదేశమందు వింధ్యమందుగూడ అచ్చటచ్చట (ముఖ్యముగా నెల్లూరుప్రాంతపు మైకాప్రదేశము, ఉత్తరఆర్కాటు, కోయంబత్తూరులోని కొన్నిశిలాస్థలులు, ధార్వారు, బళ్ళారి, కోలారులలోనికొన్నిలోహస్థలులు), కలవు. ఇవి భూమిలో సుమారు 20,000 అడుగుల లోతుననుండును. కొన్ని కడపరాళ్ళశిలలు వింధ్యపర్వతపులోభాగము నిట్టివే. వీనియంతపురాతనముకాకపోయినను, కర్నూలులోగూడ కొన్ని అజీవకాలశిలలు కలవట. హిమాలయములం దజీవశిలలు స్వల్పము. తరువాత మనదేశమందు కలిగిన పురాణజీవ శిలాస్థలులన్నిటిలో అతిప్రాచీనములు, పంజాబులో ఉప్పుగనులయొద్దను తరువాతవి కాశ్మీరమందును కలవందురు. సముద్రమందెన్నియో పురాణజీవశిలలు కలవు. మద్రాసునొద్ద నిట్టి విటీకల కొన్ని బయలుపడినవి; అందు వేయిరకముల ప్రాణుల చిహ్నములుకలవట. నర్మదా సాగరసంగమస్థలమందు నిట్టిపూర్వపు నీటిజంతువులచిహ్నములు కలవు.

# 4

## మత్స్యయుగము.

సృష్టి కొన్నివేలయేండ్లక్రిందటనే ఆరంభించెనని, ఇప్పుడు మన కగుపడు వృక్షజంతుజాతు లీస్వరూపములతోనే అప్పుడొక్కసారిగా ఉదయించినవని, కొందరు తలచిరి. కాని ప్రాచీనశిలలలోని చిహ్నముల గనిపెట్టి పరిశోధించినమీదట, చాలజీవజాతులు చిరకాలమునుండి క్రమముగా మారుచు వృద్ధినొందుచు వచ్చినవని తోచెను. మనకాజ్ఞానము వృద్ధియైనపిదప, భూమిపైనున్న వృక్షజంతుజాతులన్నియు అసలులో అజీవకాల మను కల్పాదినుండి, అదృశ్యమై అతిసూక్ష్మమగు చిత్పదార్థములోనుండి, మొదటి అత్యల్పప్రాణులుగనుండి, అంత కొద్దికొద్దిగ అవిచ్ఛిన్నముగ మారుచు, వృద్ధిబొందుచు, నూతనాకృతులదాల్చుచు, (యుగములకొలది గడచినమీదట) చివరకాస్థితికి వచ్చినవని తేలినది. ఇదియే పరిణామసిద్ధాంతము, జీవవికాససిద్ధాంతము అనబడును. భూమి వయఃకాలసమస్యవలెనే, ఈజీవవికాససమస్యను గూర్చియు చాలతీవ్రచర్చ జరిగెను. క్రైస్తవ, యూద, మహమ్మదీయమతముల మూలసిద్ధాంతముల కీపరిణామసిద్ధాంతము వ్యతిరిక్తమను భావమిప్పుడు పోయినది. జీవకోటికంతకు నొకటే మూలాధా

రమని క్రైస్తవకాతలికు, ప్రాటెస్టాంటు, యూద, మహమ్మదీయ మతస్థుల పూర్వాచారులుగూడ నిప్పు డంగీకరించినారు. జీవజాతి యేదియు మనభూమిపై హఠాత్తుగా నవతరింపలేదు; మన కగోచరములగు పూర్వమన్వంతరములందు జలాశయతీరములయొద్ద జిగురువలెనుండు మొదటిచేతనపదార్థములనుండి, ప్రాణులు క్రమముగా నుత్పన్నమై, రూపాంతరము బొందుచు వృద్ధినొంది, కాలక్రమమున ప్రస్తుతశారీరక, మానసిక, నైతికశక్తుల నొందినది.

ప్రత్యేకజీవవ్యక్తుల సముదాయమే ప్రాణికోటి యనబడును. అచేతనములగు మట్టిముద్దలు, కేవలస్ఫటికాదులును, జీవులలో చేరవు. ఇతరవస్తువుల హరించి జీర్ణించుకొనుట, పునరుత్పత్తికల్గించుట, జీవలక్షణము. అనగా ప్రాణులు తినును, కనును. వానిలోనుండి పుట్టువ్యక్తులు చాలవరకు వానిని పోలును, కాని కొంతవరకు భేదించును. వ్యక్తికిని దానిశిశువుకును స్వరూపజాతి సామ్యముండును; కాని వానిమధ్యవ్యక్తిభేదము నుండును. ఈసూత్రము ప్రాణికోటికంతకు వర్తించును.

ఇట్లు శిశువులకు తమ జనకజీవములతో పోలిక యేలకలుగునో, తిరిగి వానిమధ్య కొంతభేద మేలనో, ప్రకృతిశాస్త్రజ్ఞు లింకను నిరూపింపలేకున్నారు. ఐతే పిల్ల

లకుపోలిక భేదము కూడ నుండుటబట్టి, ఆయాప్రాణుల పరిసరములు మారినపు డెల్ల తదనుగుణముగ ఆవ్యక్తులలో కొంతమార్పు కలుగుచుండునని (సిద్ధాంతముచేగాక) అనుభవముచే గ్రహింపవచ్చు. ఒక్కొకకాలపు ప్రాణులలో కొన్నింటి గుణగణము లప్పటిపరిస్థితుల కనుకూలముగను, కొన్నిటివి వ్యతిరేకముగను, ఉండును. అనుకూలప్రాణు లితరములకన్న చాలకాలము జీవించి, చాల క్రొత్తవ్యక్తుల బుట్టించును. ఇట్లు తరములు గడచినకొలది ఆజాతిసామాన్యస్థితి మారుచు, వృద్ధియగుచుండును. ఈ "నిసర్గవరణము" వైజ్ఞానికసూత్రముగాక, ఉత్పత్తిరీతినిబట్టి అందు వ్యక్తిభేదములుండుటబట్టియు ఊహచే తేలినది. వైజ్ఞానికుల కింకను తెలియని కొన్నిప్రకృతిశక్తులు జీవజాతుల పోషింపుచు నశింపజేయుచుండును. కాని జీవితపద్ధతి తెలిసిన ప్రతిబుద్ధిమంతుడును లోకపుప్రాణులం దనాదిగా నీనిసర్గవరణపద్ధతి కలదని యంగీకరింపక తప్పదు.

ప్రాణుల యారంభ మెట్లుకలిగెనని వైజ్ఞానికు లనేక మనోహర రాద్ధాంతముల జేయుచున్నారు. ఈసమస్య తత్త్వముగాని, అందుకు తృప్తికరసమాధానముకాని, ఇప్పటికిని ఏర్పడలేదు. ఎండ వెలుగు గల వెచ్చని లోతులేని ఉప్పునీటనో బురదలోనో, ఇసుకలోనో బహుశః జీవము

ప్రారంభించి, అక్కడనుండి తీరస్థలములకువచ్చి క్రమముగ విశాలజలములలోనికి వ్యాపించియుండునని, ఇంచుమించుగా ప్రామాణికులందరు నిశ్చయించినారు.

ప్రపంచారంభమున ఆటుపోట్లు ప్రవాహములు ఉద్రిక్తములై యుండెను. కొన్నిప్రాణులు గట్టుపైబడి యెండియు, కొన్ని సముద్రపు టడుగుకు మునిగి వెలుతురు గాలి దొరకకయు చచ్చెను. కాని చిన్నచిన్నజీవులు వేరుబారివృద్ధియగుటకుగూడ, అప్పటి పురాతనపరిస్థితులు వీలుగనే యుండినవి. స్వస్థలము తప్పినను వెంటనే నశింపకుండ, అంగరక్షణకు చర్మమును, డిప్పలును ఏర్పడఁజాలుండెను. రుచిశక్తి యెంతమాత్రము కలిగినను, ఆహార మాస్వాదింపగల్గెను. కాంతి గ్రహించు అలవాటుచే సముద్రగర్భములనుండి గుహలనుండి చొచ్చుకొని బయలుదేరుచుండెను. ఎండతాపమునుండి కొంతలోతునీళ్ళకు పోవుటకును, చాల అవకాశముండెను. మొదట శరీరముల కేర్పడిన డిప్పలు, చర్మకవచములు, శత్రువులనుండి రక్షింపలేకపోయినను, ఎండదెబ్బనుండి రక్షణకు పనికివచ్చెను. తరువాత కొద్దికాలముననకే పంళ్లు, గోళ్లుకూడ, బయలుదేరెను. నీటితేళ్లే చిరకాలమువర కిదివరలో ముఖ్యజంతువులుగనుండెను. తరువాతకాలపు పురాణజీవశిలలలో 'సిల్యూరి

యను' అరుణోకభాగమున ఆ మొదటిజీవులకన్న నెక్కువ ఈతశక్తి, కండ్లు, పండ్లు, కలిగిన ఒకక్రొత్తజీవజాతి కనబడును. ఈశిలలు 50 కోట్ల సంవత్సరముల క్రిందటివని భూతత్వజ్ఞులనేకు లిప్పుడు తలచుచున్నారు. ఈప్రాణులే మనకు తెలిసియున్న వెన్నెముకగల జంతువులలో మొదటివి. అనగా ఇదియే మత్స్యజాతి కారంభము.

తరువాతవగు 'డెవోనియను' శిలలలో చేపలు చాలకలవు. చేప లప్పు డంత విస్తరించి యుండుటచే, ఆ కాలమును 'మత్స్యయుగ' మందురు. ఇప్పటి మర చేపలును మహామీనములబోలినవియు, ఇప్పు డెచ్చటను గానరాని కొన్నివిచిత్రపురాణమత్స్యములును, అప్పుడు నీటిలో విజృంభించుచు, పై కెగురుచు, నాచులో దూరుచు, ఒకదాని నొకటి తినుచు, నీటికి జీవకళ నిచ్చుచుండెను. ప్రస్తుతమానమునుబట్టి యీమీనము లంతగొప్పవికావు. తరుచు రెండుమూడడుగుల పొడుగుండెను.

మత్స్యము లేజాతినుండి పుట్టెనో భూగర్భశాస్త్రము తెల్పుటలేదు. అంతకు పూర్వపుప్రాణుల కివి ప్రత్యక్షముగ సంబంధింపవు. ఇప్పటి చేపగ్రుడ్ల బరీక్షించియు ఇతరవిధములను, జంతుశాస్త్రజ్ఞులు మత్స్యోత్పత్తిమూలమును గూర్చి విచిత్రసిద్ధాంతము తెల్చిరి. మృదుదేహులై నీటిలో

నీను కొన్ని చిన్న జంతువుల ముఖభాగమున, పండ్లు మొదలగు దృఢపదార్థము లేర్పడి, వానినుండి తరువాత మత్స్యములు కలిగియుండును. కొన్ని రకముల చేపలకు పైన క్రింద నుండు పండ్లు పెదవులద్వారా బయటకువచ్చి, సరాసరివీటి శరీరమంతయు పొలుసుపొలుసుగా నావరించి కొంతకాలమునకు వెన్నెముకగా ఏర్పడును. ఇవియే మొదటి వంశాస్థిక (=వెన్నెముకగల) జంతువులుగా పరిణమించియుండును †

---

† జీవారంభ మెందుచే గలిగె ననునదే సృష్టిలోని మహాసమస్య. సృష్ట్యారంభము కొన్ని వేలయేండ్లక్రిందనే కలిగెనని నమ్మిన ప్రాచీనక్రైస్తవులు, యూదులు, ప్రాచీనయవనులు మొదలగువారీసమస్యను సరిగా చర్చించిన ట్లగుపడదు. అట్లుగాక ఆధునికవైజ్ఞానికులవలె మన ప్రాచీన భారతీయులును ఈసమస్య నుత్సాహముతో విమర్శించిరి. కాని వారిలోను ఏకాభిప్రాయము కలిగినటుల తోచదు. సృష్ట్యాదినిగూర్చి మన పూర్వీకులభావము ఇప్పటి పరిణామసిద్ధాంతమును సమీపించును. దృశ్యములగు చిదచిత్తులన్నిటిలోను ఆత్మపదార్థము లీనమై యుండుననిి, ఆత్మనుండియే బుధ్యాములద్వారా క్రమముగా ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, పృథివి కలిగెనని, వేదఋషులభావము. "తస్మా ద్వా ఏతస్మా దాత్మ న ఆకాశ స్సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః, అగ్నే రాపః, అద్భ్యః పృథివీ", (తైత్తి. ఉ. ఆనందవల్లీ) "ఏతస్మాత్......ఖం వాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ (ముం. ఉ.......2-1-3) అసత్తునుండి సత్పదార్థము కలిగెనని ఒకసిద్ధాంతమును, సత్తునుండియే సత్తు కలిగెను, అసలు మూలప్రకృతియు సత్పదార్థమే, అని ఇంకొక సిద్ధాంతమును ప్రాచీనభారతీయులలో నుండెనని తోచును.

'అసద్వా ఇద మగ్ర ఆసీత్, తతోవై సదజాయత' (తైత్తి. ఉ. ఆ. 7) సదేవ సౌమ్యేదమగ్ర ఆసీదేక మేవాద్వితీయం। తద్ధైక ఆహుః అసదే వేద మగ్రఆసీత్'......(ఛాం. ఉ.6-2)

జగత్కారణమగు అవ్యక్తస్వరూపము సత్, అసత్, అను భేదములేనిదను సిద్ధాంత మీక్రిందివాటిలో గలదు. "నాసదాసీన్నోస దాసీత్తదానీం......" (ఋ. సం. 10 మం. అ. 11. ఋ, 2.) "సదసచ్చాహమర్జున (భ. గీ. అ- 9. శ్లో- 19.) త్వమక్షరం సదసత్తత్పరం యత్ (గీత. 11-37)

న సత్తన్నా సదుచ్యతే- గీత. 13-13.

నిర్జీవములని మనము సాధారణముగా తలచు శిలాలోహాదివస్తువులలోగూడ లీనమై యొకవిధమగు జీవముండవచ్చును. 'నిర్జీవ'వస్తువుల గూర్చిన సామాన్యభావము తప్పని మనప్రాచీను లనుటయేగాక, ఆధునికవైజ్ఞానికప్రముఖులలో నొకరగు సర్ జగదీశచంద్రవసుగారు 'ది లివింగ్ అండ్ ది నాన్లివింగ్' మొదలగు ఆంగ్లభాషలోని యుద్గ్రంథములందు ప్రకృతిశాస్త్రపరిశోధనలవల్లనే నిరూపించిరి. ఇట్లు అనాదిగా లోన లీనమైయున్న అంతశ్శక్తియే క్రమముగా అనుకూలసందర్భములందు వికసించి వ్యక్తజీవములయ్యెనని తోచును.

---

## 5

## రోంపికాలము (కూర్మయుగము 1.)

మత్స్యయుగమున స్థలభాగమున ప్రాణులు లేనట్లు తోచును. అప్పటినేల శిలయో ఊషరస్థలియోయయి, సూర్యతప్తము వర్షప్లుతముగ నుండినది. క్షేత్ర మేర్పడుట కవసరమగు క్రిమిజాతియు, నేలభేదించు తృణాంకురములును, ఇంకను భువిపై లేనందున, ఇంకను క్షేత్ర మేర్పడలేదు. నాచులేదు. నీటనే ప్రాణులుండెను.

ఈవంధ్యశిలలపై శీతోష్ణస్థితులలో చాలమార్పులు కలుగుచుండెను. ఇందులకారణము లతిక్లిష్టములు. భూమి క్రాంతివృత్తపు ఆకారము, భూచలనపు ధ్రువములస్థానమును, భూఖండముల రూపును, క్రమముగ మారెను. సూర్యతాపమును గొంతతగ్గియుండును. అందుల ఫలితముగ భూమిపై చాలకాలము కొన్నిభాగములందు చలి, మంచు, వ్యాపించినవి. మరల కొన్నిలక్షలయేండ్లు వెచ్చని భోగ్యస్థితిగలిగినది. ఈలోగా భూమిలోపలిభాగము మారుచుండెను. కొన్నిలక్షలయేండ్లకాలము భూగర్భమున ఉద్రేకముగల్గి, అచ్చటిశిలాద్రవము లగ్నిపర్వతపు జ్వాలలై పైకెగసెను. కొత్తకొండలు భూభాగములు ఏర్పడెను; కొన్నిచోట్ల సముద్రముల లోతుహెచ్చెను; కొన్నిగిరు

లింకను పెరుగజొచ్చినవి. భూగర్భములోని పరిణామముచే భూతలాకృతియు, అందుచే భూమిపై శీతోష్ణస్థితియు మారినవి; ఈ ప్రళయాంతమున కొంత స్తిమితపడెను; పొగమంచు వాన కలుగుచు, క్రమముగా ప్రవాహములు హెచ్చెను; ఆ ప్రవాహములతో కొండమట్టి వండుగా సముద్రమునకు చేరెను; అందుచే కొన్ని సముద్రభాగములు మెరకలై, అచ్చటి హెచ్చునీరు మరియొకవైపు పల్లపుభూమికి ప్రసరింపఁ జొచ్చెను. ఇట్లనేకవిధముల మెరకపల్లములు మారుచుండెను. భూమిపై భాగము గట్టిపడినప్పటినుండి భూమి క్రమముగానే చల్లబడుచుండెనని పాఠకులు తలపకూడదు. భూపటలము కొంతచల్లనై పెంకువలె ఏర్పడగనే భూమధ్య భాగపు శీతోష్ణస్థితికి పైనున్న స్థితితో సంబంధము పోయినది. 'అజీవయుగ' మను కల్పాదినే భూమిపై హిమప్రళయము కలిగిన చిహ్నాలు కలవు.

మత్స్యయుగాంతమునకు లోతులేని సముద్రములు సరస్సులు నేర్పడెను. అప్పటికి, ప్రాణికోటి జలభాగము నుండి స్థలప్రదేశమును విరివిగా వ్యాపింపదొడగెను. వీనిలో కొన్ని అప్పటికి కొన్నిలక్షలయేండ్లముందే మారుమూలల మాత్ర మెట్లో యుండెను. కాని విరివిగా వ్యాపించుట కప్పుడే వీలుకలిగెను.

ముందుగా తరుజాతి, దానివెంట కొలదిలోనే జంతుజాతి, నేలపైకి వ్యాపించియుండును. ఇదివరలో నీళ్ళ వృక్షాగ్రమును ఎండకెఁరుగా పైకితేల్చియుంచెను. ఇప్పుడు నేలపై నీటిపట్టులేని మొక్కలు భూతలముపై నిల్చి తలయెత్తుకొనుటెట్లు, మరియు ప్రక్కలనీరులేనందున, పాదముల క్రిందనున్న భూమిలోనిబురద నీరు తనదేహనాళములలోనికి తెచ్చుకొనుటెట్లు, అను సమస్యలు గలిగెను. మొక్కలలోపల నంతటను గొట్టములవంటి గట్టితిత్తులేర్పడి, అందుచే మొక్కలు నిలిచియుండుటకును, వాటినాళముల ద్వారా నీరు తీసుకొనుటకును వీలై, ఈరెండుసమస్యలును పరిష్కారమయ్యెను. ఆకాలపుశిలాచిహ్నములలో నీటితిత్తులుగల మురుగునేలమొక్కల శేషములు చాలగ గన్పట్టును. నీటిలో కొన్నివృక్షములు, కొన్నితుప్పలు వగైరాలు గలవు. వీటివెనుక నొక్కొకయుగము గడచినకొలది, అనేకజాతుల జంతుజాలములు నీటినుండిభూస్థలి కెగబ్రాకినవి. అందు గొన్ని శతపదములు, కొన్ని సహస్రపదములు; కొన్ని ఆదిమజాతిపురుగులు; పీతలకు సముద్రపుతేళ్ళకు సంబంధించినవి, కొన్ని క్రమముగా మొట్టమొదటి సాలిపురుగులుగను మెట్టతేళ్ళుగను అయ్యెను; ఇంతలో వంశాస్థికములుకలిగెను.

కొన్ని మొదటికీటములు పెద్దవి. ఆకాలపు రాక్షసపుకీగలలో కొన్నింటికి 29 అంగుళములు వెడల్పు రెక్కలుండెను. ఈకొత్తప్రాణుల కాపరిస్థితుల కనుగుణమగు అభ్యాసము కలిగినది. ఇదివరలోని జంతువులు నీటిలో ఇమిడియున్న గాలినే పీల్చుకొనెను. ఇప్పటికిని జలచరములన్నియు ఇట్లే చేయుచున్నవిగదా! కాని స్థలచరములు కాజొచ్చినజంతువులకు వలయు తడినాజంతువులు తామే సంపాదించుకొనవలెకలిగెను. ఊపిరితిత్తులలో తడిలేనివా రూపిరియాడక మరణింతురు. వీటిద్వారా గాలి రక్తములోనికి ప్రవేశించుట కూపిరితిత్తులలో కొంతతడి యుండు టవసరము. ఈపువ్వారల తడి కాపాడుటకై వాటిపై పొరలేర్పడెను. కొన్నిటికి కొత్తరకపుతిత్తులు అనగా శరీరము లోపలనే తడి లాగుకొని భద్రపరచుకొను శ్వాసకోశము లేర్పడెను. ఇట్లు క్రొత్తస్థితితో సమన్వయముకల్గెను. పురాతనపుచేపల పువ్వారలు మెట్టగాలి పీల్చుట కుపయోగింపవు. ఆపువ్వారలు స్థలచరములలో శ్వాసకోశముగా మారెను.

కప్పలు, బల్లులు మొదలగు ఉభయచరములు జలచరములుగా పుట్టి, పువ్వారలద్వారా గాలి పీల్చుకొనుచుండును; కొంతకాలమునకు చేపల యూతతిత్తిబోలు సంచి

పీటి మెడక్రింద నేర్పడి, అందు శ్వాసకోశము పెరుగును. ఈలోగా మొదటిపువ్వారలు రాలి, ఆకన్నములు పూడి పోయి, కర్ణరంధ్రమునిమిత్త మొక్క ద్వారమే మిగిలియుం డును. ఈస్థితికి వచ్చినజంతువు నేలపై గాలినే పీల్చును; కాని యిది కాన్పుకు గ్రుడ్లుపెట్టుటకై నీటిలోనికి పోవలెను.

ఈమురుగు (కూర్మ) యుగపు (శ్వాసశక్తి వెన్నె ముకగల) క్రిమికీటకములు మొలకలు ఉభయత్ర యుండు నవే. చాలవర కివి యిప్పటి కూర్మజాతివి. ఇందులో కొన్ని పెద్దవి. ఇవి భూచరములైనను చెమ్మనేలనే యుండ వలెను. అప్పటివృక్షములు నిట్టివే. వీని కిందను మెట్టపై వర్షోదకముతోను మంచుతడితోను మొలకలెత్తగల గిం జలుగాని ఫలములుగాని లేవు; వానిపువ్వారలు నీటనేపడి, అందే మొలకలెత్తవలెను. ఇట్లు ప్రాణులశరీరమున సందర్భో చితముగ మార్పులు కలుగుట యతిరమ్యము. ఈవిచిత్ర పరిణామమును గూర్చిన శాస్త్రమే 'కంపారటివ్ అనా టమీ,' అనబడు సర్వజీవాంగవిజ్ఞానము. ప్రాణులన్నియు అసలు జలసంబంధులే. చేపలు మొదలు మనుష్యునివర కున్న వంశాస్థికజంతువులకు, గ్రుడ్డుగానో, గర్భస్థపిండము గానో, ఉన్నపుడు చేపపువ్వార లుండును. తరువాత నవి పిల్లపుట్టులోగా వానియంగములనుండి హరించిపో

పును. జలచరములగు చేపలనేత్రములకు రెప్పలులేక, నీటి స్పర్శయే ఉండును; భూచరములైన పెద్దజంతువులలో ఆ కండ్లకు ఎండనుండి రక్షించురెప్పలు, తడిని భద్రపరచు పొరలు, ఏర్పడును. గాలిలోనిధ్వని మందము; అందుచే స్థలచరములకు చెవిగూబ యవసరమయ్యెను. ఇట్లే దేహమందలి యింద్రియము లన్నిటిలోను పరిసరముల కనుగుణమగుమార్పులు సరుసపాట్లు నేర్పడెను. ఆ'కర్బనకర'యుగపు ఉభయచరప్రాణులు మెట్టగాలి పీల్చగల్గినను, కాన్పునకు నీటిపై నాధారపడి, మురుగుస్థలములందు తీరములందు, నీళ్ళలోగట్టుదగ్గరను, మాత్రమే వసించుచుండెను. అప్పటికొండలు, మెట్టలు, ఇంకను నిర్జీవముగ నుండెను.*

---

* అన్ని జంతువులు పుట్టుటకు ముందు తమతల్లులగర్భమందు కొంతకాలముండును. కొన్ని పక్ష్యాదులు కొంతకాలమైనమీదట అండములుగ ఉద్భవించి, తరువాత కొద్దిరోజులలో పొదిగి శిశువులగును. మిగిలిన పెద్దజంతువులును నరులును గర్భమందు చాలనెలలు పిండరూపము న నుండును. ఈస్థితిలోనున్న అండపిండములను వైజ్ఞానికులు సూక్ష్మదర్శనిద్వారా పరీక్షించి చూడగా, అవి మొదట అల్పప్రాణులుగను, అంతట సత్స్యాదికములుగను, తరువాత కూర్మాదిరూపములుగను క్రమముగామారుచు, చివరకు ఆయాజాతిజంతువుల ఆకారము నొందునని తెలిసినది. మన మనుష్యప్రాణులును ఇట్లే గర్భస్థపిండములుగా ఉన్నప్పుడీఆకారములన్నిటిని, అంతట ఒకరీతి కోతిపిల్లరూపును, పొందిన తరువాతనే, నరశిశువుగా ఏర్పడును. ఐతే ఇవిఅన్నియు పిండస్థితిలో

గర్భమందే కలుగుటచే మనకాసంగతి తెలియదు. కాని ఈపూర్వపరిణామములు ప్రతివ్యక్తి జనించుటకు పూర్వము తప్పక కలుగుచుండును. అనగా సృష్టిలో మనభూమిపైన యుగములకొలదినుండి క్రమముగా కలుగుచున్న జీవపరిణామము ఆయా ముఖ్యజాతుల ప్రతివ్యక్తియందును క్షిప్తముగా కొద్ది రోజులలోనో నెలలలోనో కలిగి ప్రతిబింబితమగును. జీవపరిణామసిద్ధాంతము తథ్యమే అనుటకిదియు ఒక నిదర్శనముందురు. ఇట్లు పిండోత్పత్తినుండి శిశుజననమువరకు క్రమపరిణామమును వైజ్ఞానిక పరీక్షచే తెలియజేయు శాస్త్రము 'ఎంబ్రియాలజీ' (=పిండశాస్త్రము) అనబడును.

---

## 6

### సరీసృపయుగము. (కూర్మయుగము 2.)

ఈకర్బనకరయుగపు సమృద్ధప్రాణుల కంతట నొక నిర్జల ప్రళయదశ కలిగెను. అప్పటి శిలాధాతువులపై పొరలలో జీవరాశి చిహ్నములులేవు; అవి నట్టి యిసుక రాళ్లే యగుట యిందుకు నిదర్శనము. అప్పుడు శీతోష్ణ స్థితి తీవ్రముగ మారి, కొంతకాలము హిమమావరించి, అతిశీతలముగనుండెను. చాలస్థలములం దాముదుగు నేలల చెట్లన్నియు నశించి, ఇసుకరాళ్లతో కప్పబడి, అణగిపోయి క్రమముగా ఖనిజములైనవి. ఇప్పుడు లోక మందున్న రాక్షసి బొగ్గుగనులలో చాలభాగ మట్లేర్పడినదే †

కాని యిట్టి యుగసంధులందే, ఆకష్టము లనుభవించు ప్రాణికోటిలో తీవ్ర పరిణామము సంభవించుచుండును. నూతన మన్వంతరమున, వెచ్చదనము ఉదకము తిరుగ భూతలమున సమకూడగనే, కొత్తజాతుల జంతువులు వృక్షములు జనించెను. ఆకాలపు శిలలందలి దేహా శేష ముల బరీక్షించినచో, అప్పటివంశాస్థిక జంతువులు పెట్టిన

---

† మనదేశపు పర్వతములన్నిటిలో ప్రాచీనములగు హారావళి పర్వతములు, రాణిగంజి, సింగరేణి, మొదలగు బొగ్గుగనులస్థలములు అట్లేర్పడినవందురు.

గ్రుడ్లు ఇదివరలోని వాటివలెను చిరుకప్పలవలెను నీటిలో కొంతకాల ముండనక్కరలేకయే శిసువు పుట్టగానే నేలపై స్వతంత్రముగ జీవింపదగు అంగము లేర్పడినట్లు కన్పడును. ఇవి పుట్టినప్పటికే పువ్వారలుపోయి, ఆకన్నములు గర్భమందే పూడిపోవును. చిరుకప్పల అవస్థలేని యీక్రొత్త జాతి జంతువులే సరీసృపములు. ఆకాలమందే చెట్లకు గింజలుండి, సరస్సురాంపి అవసరములేకనే, ఇతరస్థలములందు రాలిసను, మొలకలెత్తెను. అప్పటికింకను నేలపై గడ్డి మొలచుట, మొక్కలు పుష్పించుట, లేదు. కాని తాళ జాతివగు కొన్ని ఉష్ణదేశపు మొక్కలు బయలుదేరినవి. అడవితుప్పలు పురుగులు చాల ఉండినవి. అప్పటి కింకను తేనెటీగలు సీతాకోక చిలుకలు లేవు; కాని పేడపురుగులుండినవి. అనగా ఈప్రళయకాలముననే, స్థలార్హమగు వివిధప్రాణు లారంభించినవి. పరిస్థితులు అనుకూలముకాగనే అవి వృద్ధియై వ్యాపించెను. యుగములుగడచి, పరిస్థితులుమారి, భూమిలోనగణ్యమగు కంపములు చలనములు కలుగుచుండినవి. వీటికితోడు భూమి క్రాంతివృత్తములోను దానికిని భూధ్రువమునకు వంపులలోను మార్పులచేతనుచాల చోట్ల వాతావరణ ముష్ణమయ్యెను. ఈయుగము మొత్తము 20 కోట్ల యేండ్లుండియుండును. ఇది 'మధ్యజీవయుగ'

మనబడును. దీనికిపూర్వపువగు 'అజీవయుగ'ము,' పురాణ జీవయుగ'ము రెండునుకలిసి మొత్తము 140 కోట్లయేండ్ల కాలముండెను. ఈమధ్య జీవయుగమున వివిధసరీసృపము లు అసంఖ్యాకముగ వ్యాపించెను. అందుచే దానిని 'సరీసృపయుగ' మందుము. ఆయుగము గతించి యిప్పటికి సుమారు 8 కోట్ల వత్సరములైనవి. ఈమధ్యజీవయుగము తరువాత, 'నవజీవయుగ'ము, ఆపిమ్మట మన ఆధునిక యుగము వచ్చినవి.

మన ప్రస్తుతకాలమున సర్పజాతుల రకములు, వానివ్యాప్తి, చాలతక్కువ. అంతకును పూర్వపు ఉభయ చరజాతికన్న, సరీసృపముల సంఖ్య యిపుడు హెచ్చుగనే యున్నది. మనముచూచు పాములు, మొసళ్లు, తాబేళ్ళు, కూర్మజాతులు, బల్లులుకూడ, ఈ సరీసృప జాతిలోనివే. ఈ జాతిజంతువులన్నిటికి సాలుపోసుగునను వేడియుండ వలెను. ఇవి చలికి తాళలేవు. పూర్వపు మధ్యజీవయుగ మందుండిన సరీసృపములును ఇట్లేయుండెను. అప్పటి జంతువులు వృక్షములుకూడ వేడిలోనే పెరిగి, మంచు నెరుగ్గానలేకుండెను. కాని అంతకు పూర్వపు ప్రాణుల కవసర మైన బురద రొంపి అక్కరలేక, ఇవి మెట్టకలవాటు పడెను. ప్రస్తుతమున్నవేగాక, ఆయుగపు సరీసృపములలో

ఇంకనుచాలరకములు, కొన్నిచాలపెద్దవి, ఉండినవి; మహా కూర్మములు, దీర్ఘమకరములు, బల్లులు, కాలసర్పములు నేగాక, ఈకాలమునలేని కొన్ని యద్భుతజంతువులుగూడ ఉండెను. 'దినోసారు' లను తక్షకజాతియు, ఇతరభీకర మృగములును ఉండినవి. మఱియు ఆకాలమున పల్లము లందు రెల్లు, తుప్పలు, చాలబయలుదేరినవి. తృణాహారు లగు సరీసృపములుగూడ బుట్టి, అంకుదూరి, క్రమముగ చాలవృద్ధి నొందినవి. వీనిలో గొన్ని తక్కిన స్థలచరముల కన్న పెద్దవై, తిమింగలములంతయుండెను. 'డిప్లొడోకస్ కార్నగై' అనునవి 84 అడుగుల పొడవుండినవి. 'జిగాంట సారసు' జాతి 100 అడుగులవరకు నుండెను. వీనినిభక్షిం చుమాంసాహారులగు 'దినోసారు'లుకూడ అట్టి దీర్ఘకాయ ములే; వీనిలోని 'టిరన్నిసారస్' అను రకపు సరీసృపము లన్నిటికన్న భీకరమని చాలగ్రంథములలో వర్ణింపబడినది.

ఈమహాజంతువు లా'మధ్యజీవయుగ'పు శాద్వల ముల దినుచు వేటాడుచుండె; ఇంకొకతెగవి ముఖాంగ ములవద్ద గబ్బిలములకుండునీతి యంగముకలవై, పురుగుల పై కెగురుచు, కొమ్మలపై వాలుచుండినవి. ఇవియే 'టిరో డాక్టిలు'లు; వెన్నెముకగల్గి యెగురనేర్చిన మొదటిపతంగ జాతి యిదియే.

కొన్ని సరీసృపములు సముద్రము చేరినవి. ఇందు 'ఇక్తియోసార్లు', 'మొసోసార్లు', 'ప్లెసియోసార్లు,' అను మూడు రకములుండెను. అందులో గొన్ని ప్రస్తుతపు తిమింగలములంత యుండెను. 'ప్లెసియోసార్' తెగ జంతువు లిప్పుడెచ్చటను లేవు. ఇవి బలిష్ఠములు, మహాకాయములు, నీటిలోనీదుచు, చవిటినేలలోను మెరకనీటిక్రిందను నడువవీలగు తెడ్లవంటి పాదములు, అల్పశిరస్సు, దీర్ఘకంఠము కలిగియుండినవి. ఇవి హంసలవలె నీటిలో నీదుచునే ఆహారము గొనెడివో, లేక నీటననగియుండి, ఆదారిని బోవు మత్స్యాదుల భక్షించుచుండెడివో, తెలియదు. 'ఇక్తియోసార్లు' సముద్రమందు ధారాళముగ దిరుగుచుండెనని తోచును.

మధ్యజీవయుగపు స్థలచరము లిట్లువృద్ధియై, పూర్వపుజంతువులకన్న బలము శక్తి వేగముగల్గి, దీర్ఘకాయములుగనుండెను. జలరంగమున నింతటి యభివృద్ధి లేకున్నను, అచ్చటను ప్రాణులుబృందములుగా వృద్ధిగాంచినవి. శంఖాకృతి డిప్పలుగల 'అమనైట్' అను ఒకజాతి జంతువులు 'పురాణజీవ'యుగమున బొడసూపి, ఈయుగమునవృద్ధియై లోతులేని నీళ్ళలో విశేషముగా నుండినవి; ఈజాతి జంతువులిప్పుడు అసలే లేవు. కాని యుష్ణదేశములందు కానబడు

సన్ననినత్తలు మున్నగునవి వానిని కొంతవరకుబోలియుం డును. మఱియు చేపలలో నింతకు పూర్వముండిన డిప్పలు పంటివంటి చెక్కలుగలవిపోయి, ఈయుగమున చక్కని పొలుసులుగల మత్స్యము లుదయించి, వృద్ధినొందెను; ఈజాతివి నేటివరకు విశేషముగా వ్యాపించియున్నవి*

---

* ఆకాలమున మన భారతదేశమును ఇప్పటికన్న చాల భయంకర మృగములతో అనేకజాతుల క్రూరసరీసృపములతో నిండియుండినట్లు కనబడును. అప్పటికి దక్షిణహిందూదేశము, ఆఫ్రికాఖండముతోను ఆగ్నేయదిశదీవులతోను కలసి ఏకఖండమై యుండెను. యూరపు మొదలగు యితరప్రాంతములందు ఆర్యావర్తమందు కన్న మనప్రాంత మందు ఉష్ణము అధికము. అందుచే నిచటి సర్పజాతులు చాల హెచ్చువి, చాలరకములు, ఎక్కువ అపాయకరములుగ నున్నవి. మరియు హిందూ మహాసముద్రమునందు, నదులందును, ఇప్పటికిని చాలమొసళ్లు విషసర్ప ములు కలవు. పూర్వము వాసుకి, తక్షకుడు, మున్నగు బలీయమగు మహాసర్పములుండినట్లును, భూమికి ఆదిశేషుడను సర్పమే ఆధారమై యుండినట్లును, మన ఆర్యులలో ఐతిహ్యము కలదు. ద్రావిడజాతులు అందు ముఖ్యముగా దాక్షిణాత్యులు సర్పముల విశేషముగ పూజింతురు. దక్షిణదేశపు సామాన్యపు గుళ్లలో చాలచోట్ల ప్రాకారమంతటను లోపలనుగూడ నాగవిగ్రహము లనేకములు గలవు. నాగులచవితినాడు నాగపూజ మన ప్రాంతమునగూడ నున్నది. మానవసంచార మారంభిం చినమీదట అర్జునుని ఖాండవదహనము జనమేజయు సర్పయాగము మొదలగు సమయములం దనేకమహాసర్పములు అజగరములు చంపబడి యుండును. అయినను ప్రపంచమం దిప్పటి అన్నిరకముల సర్పజాతు

లును భారతదేశమం దిప్పటికిని గలవు. మన దేశమున మాత్రము సస్తన జాతులకన్న సరీసృపములసంఖ్యయే యిప్పటికిని హెచ్చుగా నున్నవి. 1933-34ఏట మనదేశమున పాముకాటుచేతనే అయిదులక్షలపైగా జనులు చనిపోయిరి.

# 7

## మొదటిపక్షులు, మొదటిస్తనులు

## (వరాహయుగము 1.)

మధ్య జీవయుగపు తృణసమృద్ధిని సరీసృపబృంద ములగూర్చి తెలుసుకొంటిమి. ఆ 'దినోసారు'లు సగాగ్రములందు చవుడునేలలందు ప్రబలియుండ, 'టెరోడాక్టిలు'లు అప్పటి (పూవులేని) తరుగుల్మములపై కీటాదుల వేటాడి, తమ ఘీంకారములతో మహారణ్యముల ప్రతిధ్వనింపజేసి యుండును. ఆసమృద్ధజీవకోటిలో, కొన్నిమూలలనున్న ~~[illegible]~~ కొన్ని ~~[illegible]~~ మాత్రము నూతనశక్తు లలవర్చుకొని, సహనశీలములైనవి. కొంతకాలమున కెండమందమై, భూతలపరిస్థితులు మారెనను ఈజాతిజంతువులు నశింపక, నూతనపరిస్థితుల నెదుర్కొనగల్గెను.

దినోసారులలో గంతులువేయు కొన్ని పొట్టిజంతువులు ఆహారాదులకై పెద్దజంతువులతోపాటు పోటీసల్పునపుడును, తమశత్రుజంతువులు వెంబడించునపుడును, చల్లనిడున్నతగిరులపైకిని నీటిమీదికిని పోవలసియుండెను, లేనిచో నశింపవలసియుండెను. అట్టిబాధలోనుండుచు తంటాలుపడు కొన్ని జంతుజాతులు కొట్టుకొనుటలో వాటికి కొత్తరకపు పొలుసు లేర్పడెను. అవి క్రమముగ గద్దకల

ములవలె పొడవగుచు, ఈకల ఆకారమొందినవి; ఈ ఈకలొకదానిపై నొకటి దట్టముగా నుండుచు, తక్కిన సరీసృపముల చర్మముకన్న చక్కగా శరీరోష్ణమును గాపాడెను. అందుచే నవి సరీసృపములు తాళలేని శీతలదేశములలోగూడ నుండగల్గి, ఆస్థలములందు వసింపదొడగెను. ఆకాలముననే కొన్నిటికి తమగుడ్లవిషయమై యెక్కువశ్రద్ధ గలిగియుండును. సరీసృపములు తమగుడ్ల నశ్రద్ధగా విడుచును. ఆగుడ్లు యెండకు గాలికి పొదుగవలసియుండును. కాని యీనూతనజాతి తనగుడ్లను కాపాడుచు, వాటిని తమశరీరోష్ణముచే వెచ్చబెట్టనేర్చెను. చల్లనివాతావరణముల కీప్రాణుల శరీరములోపలగూడ మార్పులుకలిగి అవి క్రమముగా నుష్ణరక్తములై స్వేచ్ఛావిహారులగు పక్షిజాతిగా నేర్పడెను. మొట్టమొదట పక్షులు చేపలదినుసముద్రపక్షులు; వాటియుపాంగములు రెక్కలుగా నుండక, తెడ్లనుబోలి, 'పెంగ్విన్' జాతివివలె నుండెననియు తోచును. న్యూజీలాండులోని (చిన్నయీకలుమాత్రముగల) 'కివి' అను పురాతనజాతిపక్షి మామూలుగా నెగురలేదు. అది పక్షివంశపుదికాదు. పక్షులశరీరపరిణామములో రెక్కలకన్న యీకలే ముందుగా వచ్చెను; కాని యీకలువచ్చినతరువాత వాటిని విప్పుచుండుటచే, క్రమముగా తప్పక

రెక్కలేర్పడును. శిలాధాతువులలోని యొకపక్షి దేహావశే
షమును పరీక్షింపగా, దానికి సరీసృపములకుండు దవుడ,
పండ్లు, పొడుగుతోకయు, పక్షిరెక్కలు గూడ నుండెను.
అట్టిజంతువు మధ్యజీవయుగమందలి ఉరోడాక్కిలునుండి
తన్ను రక్షించుకొనగలిగియుండును. అయితే అప్పుడు
పక్షులసంఖ్య, వాటిరకములును, చాలతక్కువ. అప్పటిదేశ
మున కిప్పటినరుడు పోగలెనేని, అతడు రోజులకొలది తిరిగి
నను, పక్షిస్వరూపమే కంటబడియుండదు. ఆరెల్లుదుబ్బు
లలో ఉరోడాక్కిలులు, మొలకలచిగుళ్ళలో కీటకములు,
మాత్రము సమృద్ధిగా కనబడియుండును. వానికి 'మేములు'లు
అనగా పాలిచ్చి శిశువుల బోషించుకొను సస్తనజంతువు
లు గన్పడియుండవు; పక్షిజాతి యుదయించుటకు కొన్ని
లక్షలయేండ్లు ముందే సస్తనులు పుట్టెను; కాని అప్పటికవి
చిన్నవై మారుమూలల నుండుటచే వాటిని గమనించి
యుండడు.

ప్రథమపక్షులవలెనే, మొదటిసస్తనులును జీవి
తపుపోటీవల్లను ఘర్షణవల్లను, క్లిష్టజీవనమునకు శీతలదేశ
వాసముకు అలవడుటలో అట్లు పరిణమించియుండును.
వాటికిని మొదట పైపొరలు గద్దకలపు యీకలవలె
నేర్పడి, శరీరోష్ణమును కాపాడగా, క్రమముగా అవయవ

ములలో మార్పులుగల్గి, రక్తము వెచ్చనై; అవి స్వేచ్ఛగా సంచరింపగలైను. వివరములు భేదించినను, ఆ వికాసస్వరూపమొకటియే; ఈకలకు బదులు, పీటికి రోమము లుద్భవించెను. గ్రుడ్లరక్షించి పొదుగుటకు బదులు ఈజంతువులు తమసంతానమునకు అంగనిష్పత్తియగువరకు, తమదేహమందే యుంచుకొని, వాటిలోకొన్ని జీవిప్రసవులై కనినతరువాతగూడ ఆశిశువునుగాపాడి, పోషింపదొడగినవి. * 'మేమలు'లలో దాదాపు అన్నిటికిని స్తనము లేర్పడి, అవి శిశుపోషకములయ్యెను. ఈమేమలుజాతులన్నిటిలో రెండురకములకుమాత్రమే సరియగు స్తనములు లేవు. అవి గ్రుడ్లుబెట్టి తమశిశువుల తమచర్మములోపల నేర్పడు నొక విధమగు బలకరరసము నిచ్చిపోషించును; బాతుముట్టెగల 'ప్లాటిపసు' 'ఎచిడ్నా'యు, ఇట్లుచేయుచున్నవి. 'ఎచిడ్నా' అనునది తోలుగ్రుడ్లుపెట్టి, తనకడుపులో నొక సంచిలో నుంచుకొని, అవి పొదుగువరకు వాటిని వెచ్చబెట్టుచు కాపాడును. మధ్యజీవయుగమున మనప్రేక్షకుడు రోజులు వారములు తిరిగినను పక్షులు కనబడవగ్లె, అతని

---

* అనగా సరీసృపజాతివలె అండజములుకాక, ఈ 'మేమలు' జాతివి సాధారణముగా పిండజములు, ఇవి సస్తనులై తమశిశువుల దేహములు పోషించి పెంచుటయేగాక, వాటికి మనోవికాసము ప్రేమకల్గించును.

స్థూలదృష్టికి సస్తనులును కన్పడియుండవు. పక్షులును సస్తనులును గూడ ఆయుగపుప్రాణులలో కేవల మల్పములు నీచములు అని స్థూలదృష్టికి తోచదగియుండెను. ఈ సరీసృపయుగము సుమారు 8 కోట్లవత్సరము లుండెనని తోచును. ఆకాలపు పరిస్థితుల నరు లెవరైన గమనించినచో, ఆవస్తుసమృద్ధి, చక్కవియొండ, చురుకుగా సర్వత్ర వ్యాపించుచు నెగురు గాళులు, బలీయములగు దినోసారులును, భద్రముగ శాశ్వతముగ నుండిపోవునని తలచియుందురు. కాని ఈనిత్యత్వాభాసముకు విశ్వలీనమగు గూఢప్రవృత్తితోను, అప్రమేయమగు విశ్వశక్తులతోను, సంఘర్షణకలిగి, ఆప్రాణులు క్షీణింపజొచ్చెను. వేలకొలది యేండ్లు గడచుచురాగా, పరిస్థితులు కొంతకాల మట్లేయుండినట్లున్నను, మనకగ్రాహ్యమగు క్లిష్టపరిస్థితులు కొత్తగా నేర్పడెను. కొండలు సముద్రములు మారి భూతలస్వరూపమే మార్పుచెందెను. ఈమధ్యజీవయుగము చాల కాలము వృద్ధినొందినను, యుగాంతము రాగా ప్రళయచిహ్నములు కలిగినవి. ఆభౌతికవిపర్యయముచే నూతన పరిస్థితులు కలిగి, అప్పటిప్రాణికోటి జీవితము దుర్భరమయ్యెను. అట్లెదుర్కొను వినాశమునుండి రక్షించుకొనుటకై, 'అమనైటు'లు మొదలగు అప్పటి కొన్నిప్రాణి

లయందు ఆ

జాతుల అవయవము స్థితిగతుల కనుకూలమగునటుల చిత్రచిత్రమైన మార్పులు కలిగెను. స్థిరపరిస్థితులందు నూతనపద్ధతుల యవసరముండదు; అంతశ్శక్తులు పైకిరాక అణగియుండును; అప్పుడు సామాన్యప్రాణులును వృద్ధినొందుచునేయుండును. కాని నూతనపరిస్థితులురాగానే, సామాన్యప్రాణులు నశించిపోయి, అంతశ్శక్తిగలవిమాత్రమా గండముదాటి, పరిసరానుకూలమగు రూపస్వభావముల నొందును.

అప్పటికాలపు శిలాధాతువులం దేటిప్రాణిచిహ్నములును కన్పడవు. అప్పటిజీవచారిత్రపు సామాన్యలక్షణములుకూడ ఏమియు దెలియుటలేదు. ఆస్థితి కొన్నిలక్షల యేండ్లుండియుండును. ఆతెరతొలగగానే గోచరించు జీవకోటి పరిశీలింప, అంతయు నూతనరంగముగ నున్నది. సరీసృపయుగము గతించెను. ఆ దినోసార్లు, ప్లెసియోసార్లు, ఇస్తియోసార్లు మొదలగు మహాబలములగు చిత్రవిచిత్ర జాతులన్నియు పూర్తిగ నశించి, అదృశ్యములై, వాటి సంతతి లేకుండబోయెను. మహాశీతము వాటిని చంపివేసెను; ఆజంతువులొందిన మార్పులు చాలక, ఆ క్లిష్టపరిస్థితులకు తాళలేక పూర్తిగ నశించెను. తరువాత భూమిపైకలిగిన నూతనరంగమున వెనుకటికన్న ధృఢతరములగు

కొత్తచరాచర జాతు లుదయించెను. ఈనవయుగారంభమున ధరారంగమింకను నిస్తేజమై నిరుత్సాహకరమై యుండెను. ఇదివరలోని మహాతాళములన్నియు పోగా, వాటి స్థానే వచ్చిన క్రొత్తతాళ్లు శీతకాలపు మంచుచే నశింపకుండుటకై, తమయాకుల రాల్ప మొదలిడెను. మొక్కలకు, చెట్లకు, పువ్వులు కలుగనారంభించెను. ఇదివరలోని భీకరసరీసృపములకు బదులు, రకరకములగు పక్షులు, స్తనజంతువులు నావిర్భవించెను. *

---

* ఆయుగసంధియందు దిట్టి హిమప్రళయము, భయంకరభూకంపము, అగ్నిపర్వతప్రకోపముకూడ, మనదేశమునను కలిగిన నిదర్శనములు కలవు. అప్పటికి ముందుగా మనతూర్పుకనుమలును, తరువాత సహ్యాద్రియు, ఏర్పడెను. గోదావరితీరమున 'కోటమావెలి' శిలలలో అప్పటి హిమప్రళయముచే చనిపోయిన అనేకమత్స్యసరీసృపముల ఫాసిలులు కనబడినవి. అగ్నిపర్వతములద్వారా భూమిలోనుండి 'లావా' యనబడు కరగిన శిలాదులద్రవము దక్కనునంతను ముంచివేసెను. అంతవరకు ఆఫ్రికాతో కలసి యేకఖండముగానుండిన దక్షిణహిందూదేశమునకు ఆఫ్రికాకుమధ్యనుండిన భూస్థలి సముద్రములోనికి దించుకొనిపోయెను; అట్టిగట్టు సముద్రములోన నిప్పటికిని గలదు. మాల్దీవు అండమాను దీవులు మనభూభాగమునుండి అప్పుడే వీడెను. తరువాత నీసను యమందు మనదేశపు ఉత్తరభూభాగములోనుండి యొగసి కొండపడతలు పడుటచే, హిమాలయపర్వతము లీసనుయముననే ఏర్పడెను. పంజాబుప్రాంతమందుగూడ ననేకభూకంపములు కలిగెను. అంతకుపూర్వము

హిమాలయప్రాంతములకు వింధ్యపర్వతములకు సంబంధములేక, పడమట రాజపుతానా సముద్రము, తూర్పుననొక సముద్రమునుండెను. ఈభూప్రకోపఫలితముగా నీ రెండుసముద్రములు వెనుకకు పోయి, భూతలము పైకి తేలెను. రాజపుత్రస్థానమునకు మధ్యనున్న యెడారియు కచ్చిప్రాంతమును ఈసముద్రపు యిసుకభూములే; ఇట్లాప్రాంతమంతటను భూమియేర్పడి దక్కను ఉత్తరదేశము కలసిపోయెను. ఒకప్పుడు భూకంపముచే కొన్నిస్థలములు జలగతము లగుచుండెను. ఈకలియుగారంభమున పశ్చిమతీరపుద్వారక సముద్రగత మైనట్లు ఐతిహ్యముకలదు. సింధుదేశము అసలిట్టి యెడారియైనను సింధునదివండుపడి, క్రమముగా ఫలవంత మగుచున్నది. హిమాలయములలోపుట్టి పూర్వపురాజపుత్ర సముద్రమున పడుచుండిన సరస్వతీ నది, ఇప్పుడు క్రొత్తగా నేర్పడిన యెడారిలో కొంతదూరము ప్రవహించి, హరించిపోవుచున్నది; అది అంతర్వాహిని అని యిప్పటికిని హిందూసంప్రదాయము. ఇట్లేర్పడిన ఆర్యావర్తపు యిసుకనేల, హిమాలయములందలి పూర్వపు అగ్నిపర్వతములపైనుండి 'లావా' పడియు, గంగా యమునా నదులు హిమాలయ పర్వతములనుండి సతతము తెచ్చి నింపు వండు పడియు, ఇప్పుడత్యంతఫలప్రదమైనది. ఫలవంతమగుప్రస్తుతవంగదేశమంతయు, గంగా యమునా బ్రహ్మపుత్రానదులు హిమాలయములనుండి తెచ్చువండు యుగయుగములుగా సముద్రపుఇసుకపై పడుచుండుటచే నేర్పడినదే. సింధు, గంగా, బ్రహ్మపుత్రానదులు మూడును, మధ్యహిమాలయములలోని మానససరోవరప్రాంతమునందు, సంతత హిమపాతముచే నాకాశమునుండి దిగుచున్నట్లు కన్పడు మేరుగిరిసమీపమున రమారమి ఒకచోటనే పుట్టుచున్నను, సింధునది పడమరగాను, బ్రహ్మపుత్ర తూర్పుగను, గంగయు కైలాససమీపమున నుత్పన్నమైన యమునయు దక్షిణముగాను వెళ్లి, వేర్వేరు

4

మార్గములను చాలదూరమున భారతదేశమున బ్రవేశించి, మనఆర్యావర్తపు ఆయాప్రాంతముల వండుతోను శుద్ధోదకముతోను నింపుచు, అచటి ప్రాంతముల నత్యంత ఫలవంతములు గావించి, అందుల కోట్లకొలది జనుల కమితోపకారులై, విలసిల్లుచున్నవి. ఇంతేకాక, బ్రహ్మ (బర్మా) దేశపు ఐరావతీనదికి, శ్యామ (సయాం) దేశపుమోకాంగునకు, చీనాసం పదకంతకు ముఖ్యాధారమై కోట్లకొలది జనులబోషించుచున్న ఆదేశపు ప్రధాననదులగు 'హొయాంగ్ హొ' 'యాంగ్ ట్సెకియాంగ్'లు మొదలగు ఆసియాఖండపు పావనమహానదులకు, హిమాలయపర్వతములే ఉత్పత్తిస్థానము. ఈనగాధిరాజము ప్రస్తుతప్రపంచమందలి పర్వతములన్నిటిలో అత్యున్నత శిఖరములుగల్గి, అసమానమగు ప్రకృతిశోభగల కాశ్మీరాదిదేశములకును మానసాది సరోవరములకును ఆలవాలమై, ప్రాచీనార్యులచే దేవభూములని యెంచబడుచుండెను. అయితే భూమి వయఃకాలమునుబట్టి చూచినచో ఈమహాపర్వతము అంతగాప్రాచీనము కాదనియు, మనదేశపు రాజపుత్రస్థానమందున్న హారావళీపర్వతములకేగాక, మన తూర్పు పడమటికనుమలకు వింధ్యపర్వతములకుగూడ, తరువాతనే యేర్పడినదని భూతత్వజ్ఞుల యభిప్రాయము. ఈహిమాలయపర్వతపుమడతలు ఏర్పడినతరువాత, దానిలోపలిభాగ మింకను పూర్తిగా కుదుటబడక, దానిక్రింద ననేక పరిణామములును, పూర్వపశ్చిమాగ్రములందు అగ్నిపర్వత ప్రకోపమును ఇంకనుకలుగుచునే యున్నవి. ఆప్రాంతమునను దానికంటియున్న అస్సాము, నేపాలు, ఉత్తరబీహారులలోను, పెద్దభూకంపము లిప్పటికిని కల్గుచున్నవి; 12—6—1897 వ తేదీని అస్సాములో కలిగిన తీవ్రభూకంపమును, 4—4—1905 వ తేదీని సుమారు 20 వేలమందికి ప్రాణహాని కలిగించిన కాంగ్రాభూకంపమునే కాక, చాల చిల్లర భూకంపములచే గూడ, మార్పులుకలుగుచునే యున్నవి. హిమా-

లయపాదముల క్రిందటి మార్పులవల్లను, చిరకాలమునుండి పర్వతముల నుండి వచ్చిపడు వండు ఇంతవరకు సరిగా గట్టిపడక, ఇప్పుడు కుదుట పడుటవల్లను, హిమాలయములకు దక్షిణమున నంటియున్న నేపాలము లోను, ఉత్తరబీహారులోను 15-1-1934 వ తేదీని మహాభూకంపము కలిగి, అందు చాల జనులు పోయి, భవనములు కూలుటయేగాక, అచ్చటి భూతలము చితికి, మైళ్లకొలది భూగర్భపుయిసుక, ద్రవపదార్థములు పైకివచ్చి, పల్లపుసాగుబడి భూముల మట్టమంతయు తారుమారై, కల్లోలము కలిగించినసంగతి పాఠకులకు విదితమే. వింధ్యాద్రియు ఇంక ను దక్షిణముగనున్న కొండలును భూమియు మిక్కిలి ప్రాచీనములు; మధ్యజీవయుగమందే అచట అగ్నిపర్వత ప్రకోపములు, లావాప్రవా హములు పూర్తియై, దాని అడుగుభాగమంతయు బాగుగాగట్టిపడి స్థిర మైనందున, మనప్రాంతములో భూకంపప్రమాదము అగ్నిపర్వతబాధ లేదు. 1897, 1905 లోవలె, 1934 జనవరిలోకూడ, ఆభూకంపస్పర్శ యేగాని, ఉత్తరదేశమందువలె మనకు నష్టమేమియు గలుగలేదు.

---

52

# 8

## సప్తనయుగము. (వరాహయుగము 2.)

'నవజీవయుగ'మను ఆనూతన మహాయుగ మారంభించినప్పుడు, భూమిఉత్క్షేపము అగ్నిపర్వత ప్రకోపము చాల హెచ్చుగనుండెను. ఆకాలముననే ఆసియాఖండపు హిమాలయ పర్వతములు, యూరపులోని ఆల్ప్సుగిరులు, ఉత్తరఅమెరికాలో వెన్నెముకవలె నేర్పడిన 'రాకీసు' కొండలు, దక్షిణ అమెరికాలోని 'ఆండీసు' నగములు, భూమిపైభాగమున కుబికి యేర్పడినవి. ఇప్పటి మనభూఖండములకు మహాసముద్రములకుగల సామాన్యాకార మాకాలమందేర్పడెను; భూతలముకు సుమారు ఇప్పటి రూపు వచ్చెను. ఈనవజీవయుగ మారంభించి యిప్పటికి 4 మొదలు 8 కోట్ల యేండ్లైయుండును.

అప్పటికి ప్రపంచమింకను చాలచల్లగనే యుండి, తరువాత వెచ్చబడజొచ్చెను. అంతట క్రమముగా, జీవకోటి వృద్ధియయ్యెను; తరువాత చిరకాలముకు తిరుగ క్లిష్టపరిస్థితు లుదయించి, అతిశీతమగు హిమయుగములు కలిగినవి; వానినుండి మనప్రపంచ మిటీవలనే బయటపడినది.

శీతోష్ణస్థితు లిట్లు తారుమారగుటకు కారణము లింకను మనకు సరిగా తెలియవు. అందుచే ముందెట్టి మార్పులు కానున్నవో, మున్ముందు మనకు సూర్యతేజమే హెచ్చునో, హిమయుగమే తిరుగ మనభూమి నెదుర్కొను నో, అగ్నిపర్వతములు భూకంపములు ప్రకోపించునో, తగ్గునో, ఇట్టిసమస్యలు పరిష్కరింప దగు శాస్త్రపరిజ్ఞాన మింకను మనకుచాలదు.

ఈమన్వంతరమందే తృణజాతు లంకురించి, భూమి పై పశువుల మేతకు పచ్చిక యేర్పడెను. పాలిచ్చు జంతువులు కలిగి, ఈ తృణముల మేయుచు, వృద్ధి గాఁజొచ్చి నవి. ఇంతలో నాజంతువులదిని జీవించు మాంసాహారు లుద్భవించెను.

తుప్పలను కీటకాదులను దిని, వెనుకటి యుగము లో జీవించి చాలవరకు నశించిన సరీసృప జంతువులకును, ఈనూతన జంతువులకును స్వరూపభేద మంతగాలేదని, పూర్వపు దినోసారులకు ఈస్తనులకు, పూర్వపు టెరో డాక్టిలులకు ఈపక్ష్యాదులకు, భేద మతిస్వల్పమని, స్థూల దృష్టికి తోపవచ్చును. కాని, ఈపోలిక కేవలబాహ్యమే; విశ్వమందు ప్రాణులు అనంతముగ, అవిచ్ఛిన్నముగ, చిత్ర విచిత్రములగు వివిధరూపములతో కలుగుచున్నవి; సృష్టి

సర్వదా వృద్ధియగుచున్నది. భూమి పూర్వస్థితి ఎన్నడు నాకేకీతినిలేదు. అంకుచే సంపూర్ణసామ్య మెచటను లేదు. మధ్యజీవయుగపు ప్రాణులకును ఈనవజీవయుగపు ప్రాణులకునుగల సామ్యముకన్న, భేదమేచాలయధికము.

ముఖ్యముగా నీరెండుకాలముల ప్రాణులకు మనః ప్రవృత్తిలోనే భేదముకలదు. ఈక్రొత్తయుగపు స్తనులు, కొంతవరకు పక్షులును, తమపిల్లలవిసర్జింపక, వీనితో సంపర్కము కలిగియుండెను. సరీసృపములు సాధారణముగా తమగ్రుడ్లజోలికి పోక, వీనినివిడచి తమదారినిపోవును. ఆగ్రుడ్లు తమంతతామే పొదిగి, పిల్లలుకావలెను. సరీసృప శిశువుకు సాధారణముగా తనతల్లిదండ్రులగూర్చి యేమియు దెలియదు; దానిజ్ఞానము స్వానుభవముతోనే ఆరంభమై, తనతోనే అంతరించును; తనశిశువులకు లభింపదు; అది తోడిజంతువులతో సంప్రదించుట, వానిననుకరించి వానివల్ల సంగతులు నేర్చుకొని, కలసి పనిచేయుట ఉండదు; అది ఏకాకిజంతువు. అట్లుగాక స్తనులకు, పక్షులకు, తమశిశువుల పోషణము ముఖ్యలక్షణము. వాని పిల్లలు శైశవమునుండి తమతల్లిదండ్రుల ననుకరించి, వాని చేష్టలను చర్యలను గ్రహించును; వానిధ్వనుల గనిపెట్టి జాగ్రత్తపడుచు, వానితో కలసి మెలసి పనిచేయును. పర

స్పరసహాయముకలిగి, ఒకదానికొకటి లోబడియుండును. ప్రపంచమున బోధ్యజాతిజీవులు నవజీవయుగమందే మొదలిడెను.

నవజీవయుగపు మొదటిస్తనుల మెదడు, అంతకు వెనుకటిమాంసభక్షక దినోసారుల మెదటికన్న, అంతగా ప్రశస్తముకాదు; కాని ముందువచ్చు శిలాధాతువుల బరీక్షించినకొలదిని, అన్నిస్తనులలోను సామాన్యముగా మెదటిబలము చాలవృద్ధియగుచుండినట్లు కనపడును. ఆయుగారంభమందే, ఖడ్గమృగమువంటి జంతువులుండెను. ఆకాలమందే యుండిన 'టిటానోథరియం' అను మహామృగము తనచర్యల ఖడ్గమృగమును బోలియుండెను. ఇదిప్రారంభదశయగుటచే, దానిమస్తిష్కమిప్పటి ఖడ్గమృగముల మెదటి పదవవంతుకును తీసిపోవును.

మొదటిస్తనులు తమశిశువులకు పాలీయగనే, వానిని విడుచుచుండెను. కాని తల్లి శిశువులు తమపరస్పరభావముల గ్రహించి కలసియుండుటయే లాభకరమని గ్రహించియుండును; తరువాతవచ్చు స్తనులు మందలుగా తిరుగుచు, పరస్పరచర్యల గమనించుచు, ఒక్కొకదానికి కలుగు ప్రమాదముల, వానిచేష్టాశబ్దములబట్టి, కనిపెట్టుచుండినట్లు తోచును. ఈబుద్ధివికాసము వెనుకటియుగపు

వంశాస్థికజంతువులలో కనబడదు. సరీసృపములు చేపలూ కూడ బృందములుగా నుండుట, వాటి గ్రుడ్లొకచోటనే పొదిగి ఏకస్థలమందుండుట, సంభవమే; కాని స్తనుల సంఘీభావమునకు కారణము పరస్పర ప్రీతియే గాని కేవల బాహ్యసంపర్కముగాదు.

సరీసృప ప్రపంచమునకు మనస్తనులకుగల యీ ముఖ్యభేదమును, సరిగా గ్రహించుట కష్టము. సరీసృపముల తీవ్రత, తృష్ణ, వాటిభయక్రోధములు, మనయూహాలకతీతములు. వాటియుద్దేశము లేకభావచోదితములు, సహజోద్రేకరూపములు; మనస్తనుల యుద్దేశములట్లుండక, మిశ్రితములై, అనేకసందర్భముల చర్చచే నేర్పడుచుండును. స్తనజంతువులకు పక్షులకు, కొంతవరకు మనవలెనే, నిదానము, సానుభూతి సాంఘికబుద్ధి యుండును. అందుచే సాధారణముగ అట్టిజంతువులతో మనము సంబంధము పెట్టుకొనవచ్చును; బాధకలుగుచో, అరచియు, ముఖాదిచర్యలచేతను, అవి మనసానుభూతిని సంపాదించును. మనభావముల గ్రహించి లోబడి మనతోనుండునట్లు మనము వానిని పెంచి, మనవిషయమున నిగ్రహాశక్తులు కలిగించి, నేర్పవచ్చును. 'నవజీవయుగ' చిహ్నమగు యీనూతనచిత్తవికాసముచే, వ్యక్తులలో పరస్పర

సహాయము, సంప్రదింపు, మొదలిడెను. ఈ పరిణామము రాబోవు నూతనసాంఘికాభివృద్ధికి పూర్వరంగము.

ఈనవజీవయుగము గడచినకొలదిని, అప్పటి చరాచరప్రాణుల కిప్పటివానితో పోలిక యెక్కువగుచువచ్చినది.

ఇప్పటిప్రాణులతో పోలికలేని వికృతరూపమగు 'ఇంటాథెరస్' మున్నగు అప్పటి క్రూరమహామృగములు క్రమముగా నశించిపోయెను. కొన్ని పూర్వమృగముల స్వరూపము కాలక్రమమున మారుచురాగా, ఇప్పటిగుఱ్ఱములు, నీటిగుఱ్ఱములు, ఒంటెలు, ఏనుగులు, దుప్పులు, కుక్కలు, సింహములు, పులిజాతులు, కలిగినవి. గుఱ్ఱము క్రమముగా పరిణామమొందిన విధము, అప్పటి శిలాధాతువులచే, బాగుగ తెలియును. నవజీవయుగారంభపు 'టాపిర్' జాతిమృగము క్రమముగా మారి గుఱ్ఱమేర్పడెను; దాని అన్నిరూపముల చిహ్నములు దొరికెను. ఇట్లే 'లామా' జంతువులకును ఒంటెలకును జరిగిన పరిణామక్రమమును దెలసినది. *

---

* భూమి పరిస్థితిలోను శీతోష్ణస్థితిలోను ఆయాయుగాంతములందు ఇట్లు విపర్యయము కలిగి, తరువాతవచ్చు యుగస్థితి అంతకు వెనుకటి స్థితికన్న వేరుగానుండుటకు, భూచరిత్రమేకరీతిగా నుండకపోవుటకు, సౌరమండలములోని స్థితి కొంత కారణమే; కాని ఇంకను వేరేముఖ్య

కారణములుండును; కనుకనే ముందుస్థితి ఎట్లుండునో గ్రహించుటకు మన విజ్ఞానముపయోగించుటలేదు. భూమి తాను గిరగిరతిరుగుచు సూర్యునిచుట్టి వచ్చుచుండుటచే, సాలుకొకసారి సౌరమండలపు అన్ని భాగములను మనము చుట్టివచ్చుచున్నాము. ఇంతేగాక, సూర్యుడే స్థిరుడు స్వతంత్రుడు కాడు; తనచుట్టుతిరుగు మనభూమి అంగారకుడు మొదలగు గ్రహములు సౌరకుటుంబములోనివిగదా! కాని సూర్యుడును, మహాకాశమందలి 'గలక్టిక్ సిస్టం' అనబడు విచిత్రమహాచక్రములోనొక అంశము; ఈఅద్భుతచక్రములో సూర్యునివంటివి ఇంకను లక్షలకొలది నక్షత్రగోళములు పరస్పరాకర్షణగలిగి అగణ్యవేగముతో తిరుగుచుండును. అందుచే సూర్యుడును, (తన అంగములగు) సౌరకుటుంబపు) గ్రహములుగూడ, అవశముగ నిరంతరము తిరుగుచు, అర్బుదములకొలది మైళ్లదూరమందున్న ఏదో కేంద్రముపైపు అసంభావ్యవేగముతో పోవుచున్నాడు. (ఈగమనవేగము సెకండుకు అనగా క్షణముకు 200 మైళ్లు అనియు, అద్భుతవిస్తృతిగల ఈమహాచక్రమున సూర్యుడొకసారి ఆవేగముతో చుట్టి స్వస్థలమును వచ్చుటకు 25 కోట్లఏండ్లుపట్టుననియు, సర్ జేమ్సుజీన్సుగారిఅభిప్రాయము) ఈచక్రగతిచే సూర్యునితోబాటు (సౌరకుటుంబపుదగు) మనభూమియు అట్టిదనోవేగముతో మహావిశ్వమందు మనకు తెలియవీలులేని క్రొత్తప్రాంతములకు పోవుచున్నది. ఇట్లు అమితవేగముతో పోవుచుండగా, కొంతకాలముకు ఆప్రాంతములనూతనపరిస్థితుల ప్రవేశించుటచేతను, ఇతరమహాగోళముల సామీప్యముచేతను, సూర్యునిలోను భూమివాతావరణమందును భూమిలోపలను గూడ క్రొత్తపరిస్థితులు కలిగి, అందలి జీవకోటి స్థితిగతులు మారిపోవచ్చును; అందుచే ఆయుగస్థితిమారి, క్రొత్తపరిస్థితిచే నూతనయుగము కలుగవచ్చును. ఈఅద్భుత మహాచక్రగతిచే దీనిని నియమించు (మనకు తెలియని)

మహాకేంద్రపుసామీప్యమో, ఆప్రాంతపు మరియొక మహాశక్తియో, మన వాతావరణస్థితి మార్చి, భూమిపై జీవశక్తిని వృద్ధిచేయవచ్చును. ఆప్రభావముచే ఒక్కొక యుగముదాటిన కొలది క్రమముగా వెనుకటికన్న హెచ్చుమేధాబలము అంతశ్శక్తిగల క్రొత్తప్రాణిజాతు లుదయించుచున్నవని ఊహింపవచ్చును. ఇట్లా ప్రభావమున వెనుకటి యుగముల మృగజాతికన్న ఎక్కువజ్ఞానము నైతిక శక్తిగల నరజాతి ఈయుగమున కలిగినట్లే, భావియుగములందు సృష్టివికాసమున ఇంతకన్న హెచ్చునైతిక మానసిక శక్తులుకలిగి మనకిప్పు డద్భుతముగ తోచు దేవజాతులు మన భూమిపై కలుగునేమో!

---

# 9

## వానరయుగము.

జీవశాస్త్రజ్ఞులు ఈస్తనజాతిని కొన్నిశాఖలుగా విభజించిరి. వీటిలో నగ్రగణ్యమగు 'ప్రైమేటు' లను ప్రథమశాఖలో, 'లెమూరు'లు, కోతులు, తోకలేని వానరములు, మనుష్యకోటియు, చేరును. మొదట నీవిభజన ఆజంతువుల దేహాంగసామ్యమును బట్టియే చేయబడినవి; అప్పటికి వాటి మనస్తత్వముల పరిగణింపలేదు. ఈ ప్రథమశాఖ యెందుండివచ్చెనో, పురాతనశిలాదిపరీక్షచే తేలుటలేదు. ఈశాఖలోని లెమూరుకోతు లరణ్యములలోను, కొండముచ్చులు రాతిస్థలములందును, వసించును. ఈజంతువులు హఠాత్తుగా అణగి శిలాదులందు కప్పబడిపోవుట చాలయరుదు; ఈజాతివి తక్కినజాతులంత హెచ్చుగాను లేవు; అందుచే వీటిదేహశేషములు భూగర్భమున జిక్కి శిలాధాతువులలో జేరి మనపరీక్షకు దొరకుట కష్టము. గుఱ్ఱములు, ఒంటెలు మొదలగు జంతువులతాలూకు దొరికినన్ని దేహశేషములు వీటివి దొరకలేదు. కాని ఈశాఖ పురాతనవానరములు లేమూరులు నవజీవయుగారంభమందే (అనగా 4 కోట్ల ఏండ్లక్రిందనే) ఆరంభించెను; వాని

మెదడు అంగవిస్పష్టత లోటుగా ఉండి, ఇప్పటి యీజాతికి తీసిపోవును.

ఈనవజీవయుగపు సంకులప్రాణిలోకము గూడ చివరకు క్షీణించెను. కూర్మయుగపు మహాజంతువులకు కలిగిన గతియే వీటికిని కలిగినది. ఇంకొకసారి మన ప్రపంచము హిమప్రళయముపాలై, చల్లబడిపోయెను; తిరిగి కొంత వెచ్చనై, మరల చల్లబడెను. వెనుకటిఉష్ణకాలపు నాచులో తిరుగుచుండిన నీటిగుఱ్ఱములు, ఇతరమృగముల వేటాడిన ఖడ్గదంష్ట్రిలగు భీకరశార్దూలములు, హిమప్రళయమున చాలవరకు నశించెను. రోమావృత దేహములగు నొకజాతి ఖడ్గమృగములు, 'మ్యామతు'లు శీతదేశపు ఋషభములు, ధవళమృగములును మాత్రము, ఈశైత్యాహతికి నిల్వగలిగెను. క్రమముగా శతాబ్దములు గడచి, ఆర్కిటికుప్రాంతపు మంచుగడ్డ లుత్తరమునుండి దక్షిణముగాజారి వ్యాపించి, ఇంగ్లండులో థేమ్సునదివరకును, అమెరికాలో ఓహియోవరకు, వచ్చినవి. † తరువాత కొంతకాలము వెచ్చగానుండుచు, తిరిగి దేశములు తీవ్ర శిశిరములగుచు వచ్చెను.

---

† అనగా మన ఆసియాలో ఉత్తరహిమాలయప్రాంతమువు ఆహద్దు సరిపోవచ్చును.

ఇట్లు మధ్యమధ్య వచ్చుచుండిన ఈ శిశిరకాలములను ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ, హిమయుగములనియు, వాటిమధ్యనుండిన వెచ్చని కాలములను 'ఇంటర్ గ్లేషల్ పీరియడ్స్' అనగా హిమమధ్యయుగములనియు, భూతత్వజ్ఞులు చెప్పెదరు. మన భూమిపై, ఆ హిమాఘాత చిహ్నములింకను కలవు. మొదటి హిమయుగము ఆరు లక్షల వత్సరములకు పూర్వమును, నాల్గవది 50,000 యేండ్లక్రిందటను, కలిగెను. ఈ దీర్ఘ శీతకాలమందలి పరమహిమముననే నరులబోలు మొదటిజీవు లవతరించెను.

నవజీవయుగమధ్యమందే, దవడలు, కాలినరములు కలిగి తోకలేక, కొంత నరచిహ్నములుగల కోతులుండెను. కాని ఈ హిమయుగములు వచ్చినపుడే, నరులని భ్రమింపదగిన వానరజాతి జనించెనని, అప్పటిపనిముట్లవల్ల తేలును. యూరపుఖండమున, 10 లక్షలు మొదలు 5 లక్షలలోపు ఏండ్లక్రిందటివి, కొన్ని పూర్వపురాళ్లు (పనిముట్లుగాను, ఆయుధములుగాను, ఎవరో చెక్కినవి) కలవు. ఈవస్తువుల 'ఎయొలిత్తు'లు అనగా ఉదయశిలలందురు. యూరపులో వీటి నిర్మాతలదేహశేషములు లేవు. ఆ యుపకరణములేయున్నవి. నరులుకాక, సూక్ష్మబుద్ధిగల వానరములే, వాటిని నిర్మించియుండవచ్చును. జావాద్వీప

ములోని 'ట్రినిల్' అనుచోట, ఆ కాలపు పురాతనవస్తువులలో నొక నరవానర కపాలమును, పండ్లు నరములు కోతుల మెదటికన్న పెద్దమెదడును కలవు. ఈజాతి నిలచి నడచినట్లు చిహ్నములుకలవు. 'గచ్ఛన్నరవానరు' లనబడు ఉదయశిలానిర్మాతలగు ఈ జాతి జీవుల సమాలోచన కీ అస్తిపుంజము మాత్రము మనకు మిగిలినది.

ఇక రమారమి 2½ లక్షల యేండ్లక్రిందటికి వచ్చిన తరువాతనే, నరులబోలు జాతిచిహ్నములు మనకు తిరుగ కనబడును. అవి వెనుకటివానికన్న నెక్కువ వృద్ధిపొందినవి; అప్పటిపనిముట్లు ఉదయశిలలకంటె చక్కనివి, హెచ్చు పనితనముగలవి, ప్రస్తుత మనుష్యనిర్మితములకన్న పెద్దవి. తరువాత (జర్మనీప్రాంతపు) 'హీడెల్ బర్గు 'నగరమునొద్ద నొక యిసుకగుంటలో, ఆకాలపు గడ్డములేని దవుడయెముక ఒకటి దొరికినది. ఇది నరులదానికన్న చాల బరువుగా సన్నముగా నుండుటచే, ఇందు నాలుక తిరిగి విస్పష్టముగా మాట్లాడుటకు వీలుకలిగియుండదు. ఈ యస్థికనుబట్టి, ఆ కాలమున మన నరులకన్న బలీయులై, నరతుల్యులు రోమావృతులు అగు నొక నారసింహజాతివా రుండిరని,వైజ్ఞానికు లూహించుచున్నారు. ఈజాతికి "హీడెల్ బర్గు" నరు డందురు. ఈదవుడ నరము మనకు వినోదము, ఆవేదము,

కలిగించును. దీనిని చూచిన, అప్పటిపురుషుల ఆకారము, మసిపట్టిన యద్దములోనుండి చూచినట్లుండును. అప్పటి శీతలమహాగహనములలో ఖడ్గదంష్ట్రములగు ఆ ఘోర శార్దూలముల నోటినుండి తప్పించుకొన నిడుములబడుచు, ఈ 'హీడిల్బర్గు' నరుడు నిబిడారణ్యమధ్యమున రోమావృత ఖడ్గమృగముల గనిపెట్టుచు తిరుగుచుండెనని తలప వచ్చును. ఇంతకన్న నితనిగూర్చి తెలియదు; కాని యాతడు భేదించి తయారుచేసుకొన్న పనిముట్లు మాత్రము నిల్చియున్నవి. ఆంగ్లదేశపు ససెక్సులోని 'పిల్టుడౌను' వద్ద నింకను చమత్కారమగు జంతుశేషములు కలవు. ఇవి 'హీడిల్బర్గు' నరములకన్న పూర్వపువని కొందరు తలచిరి. కాని, ఇవి ఒకలక్ష లక్షున్నరయేండ్లవే యని తోచును; దీనికపాలము వానరముల పుర్రెకన్న చాల పెద్దది, దీని వద్ద దొరకిన చింపాంజినిబోలు దవుడయెముక దీనిదగునో, కాదో, తెలియదు; ప్రక్కనొక్క యేనుగనరము గబ్బిలపురూపుగా నేర్పుతో చెక్కి, అందులో నొకకన్నము గూడ దొలిచియున్నది. దీనిపై దప్పితొడ నరమొకటి అమర్చియున్నది. ఇట్లు నరములలో రంధ్రము గావించిన దెట్టిజంతువు? వైజ్ఞానికులు దీనికి 'ఇయాంత్రపస్' అనగా 'ఉదయనరుడు' అని పేరిడిరి. ఇది 'హీడిల్బర్గు' వానరుని

కిని తోకలేని కోతులకుగూడ, భిన్నము; ఇట్టిది మరి యొకటి దొరుకలేదు; చకిముకిరాతితోను, యితర శిలలతోను వీరుచేసిన చక్కని పనిముట్లు మాత్రము భూమిపై మట్టిలోను, కంకరనేలలోను, లక్షయేండ్లుగా వ్యాపించియున్నవి. ఇంను ఉదయశిలలేకాక, కత్తులు, చేతిగొడ్డళ్లు, బల్లెములు, విసరివేయురాళ్లు, ప్రాచీనవస్తుశోధకులకు దొరకినవి.

ఇప్పుడు మనము నరజాతిని సమీపించితిమి. నరుని బోలియు యథార్థనరుడుగాని 'నియాండర్తలరు' అను ఇంకొక విచిత్రజాతిని రాబోవు అధ్యాయమున గమనించెదము. మన నరజాతివారి 'హీడెల్బర్గు' వానరునుండిగాని, ఇయాన్త్రపసునుండిగాని, ప్రత్యక్షముగ వచ్చెనని వైజ్ఞానికులెవరును చెప్పరు. వీనికి నరులతో చాలపోలికమాత్రమున్నది*

---

*పూర్వముండిన కొన్ని విచిత్రజంతువులు అప్పటిశీతోష్ణపరిస్థితి హఠాత్తున తీవ్రముగా మారగానే నశించిపోవుట సహజము; మనదేశమునను 'మ్యామతు'లబోలు తెల్లని దీర్ఘవక్రదంతములుగల గజజాతియు కొన్ని మహాసర్పములు, మహాక్రూరములగు శరభాదులును, పూర్వముండినవి, ఇప్పుడులేవు; పూర్వము హిమాలయాదులందు ధారాళముగా సంచరించిన మృగరాజగు సింహమును మనదేశమున నశించిపోయినట్లే గుజరాతులో మాత్రము సకృత్తుగా కలదని వాడుక. పూర్వము

పశ్చిమహిమాలయములందును అస్సాములోను తోకలేని కోతులుండి నట్లు శిలాధాతువులలో నిదర్శనములు కలవు. ఇవి ఆఫ్రికాలోనున్న చింపాంజిగోరిల్లాలను మలయాప్రాంతమందలి 'ఒరాంగుటాంగు'ను చాల వరకు బోలియుండును. వాతావరణమున నిట్లు తీవ్రముగ కలుగుమార్పులకు సహించుకొనలేక అట్టిపూర్వజంతువులు నశించినవి. ఐనను అత్యుష్ణస్థలము లందు వివిధప్రాణు లున్నట్లే అతిశీతస్థలములగు ధ్రువప్రాంతములయొద్దను ఆప్రాంతములకు అనుకూలములగు శరీరనిర్మాణముగల చిత్రవిచిత్ర జంతువులు కలవు. దక్షిణ ధ్రువప్రాంతపు సముద్రమునం దిదివరకెన్నడు ను లోకమునలేనంత మహాకాయముగు తిమింగిలజాతి అక్కడి నాచును క్షుద్రజంతువులను దిని బ్రతుకుచున్నటుల ఇటీవలనే కనుగొనబడినదట; సముద్రపుఅడుగున కాంతియుతములగు విచిత్రజంతువులుకలవు. ఆయా దేశకాలపరిస్థితుల కనుకూలమగు శరీరములతో అన్నిప్రాంతములందును జీవకోటి వ్యాపించియుండుట భూమిపై అనుభవసిద్ధము.

---

# 10

## నియాండర్తలర్, రోడిసియను నరయుగము

## (నారసింహాయుగము)

నాల్గవ హిమయుగపు, అనగా నలుబది యేబది వేల యేండ్ల క్రిందటి, ఒక నరసముని దేహశేషమునుబట్టి, ఆతడు నిజముగా నరుడే యని ఇటీవలివరకు తలచిరి; దాని పుర్రెలు, నరములు దానిపనిముట్లు దొరికినవి. ఆజంతువు నిప్పు గూడ జేసుకొని, చలిబాధలేకుండ గుహలలో ~~నివసించెను చుండెను~~. అవి జంతుచర్మములగూడ ధరించి, మనవలె కుడిచేతి అలవాటును కలిగియుండెనని తోచును.

కాని యిదియు నిజమైన మనుష్యజాతికాదని జాతి శాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. ఇవి ప్రథమశాఖలోని వేరొక ఉపశాఖ; వీటిదాడలు బలువై బాగుగ ముందుకు వచ్చి యుండును; లలాటము దిగి, దట్టమౌ కనుబొమలు కలవు. మన బొటనవ్రేళ్లతోవలె, వానితో మిగిలిన వ్రేళ్లను నొక్కిపట్ట వీలులేదు. వీని కంఠనిర్మాణమునుబట్టి వెనుకకు మెడవంచి పైకి చూడవీలులేదు. అవి తల ముందుకు, క్రిందికి, వంచుకొనియుండును. వాటిగడ్డములేని దౌడసరములు నరులవాటివలెగాక, "హీడెల్బర్గ" దౌడనరముల బోలియున్నది; పండ్లలోను చాల భేదముకలదు; దౌడ

పండ్లు మన దౌడపండ్లకన్న క్లిష్టతరముగనున్నవి. వానికి మనకుండు కోరపండ్లు, అట్టి దంతములు, లేవు. పుర్రెవైశాల్యము మనవలెనున్నను, వీనిమెదడు వెనుక పెద్దదిగను, ముందర చిన్నదిగను, ఉన్నది. దాని నిర్మాణమును వేరు. అవి నరజాతిజనకములు కావు; వాని మనశ్శరీరములు నరులవానికన్న వేరు. ఈప్రాణులిప్పుడు లేవు. వీనిపుర్రెలు, నరములు, 'నియాండర్తల్'లోను, ఇతరస్థలములందును, దొరికినవి. అందుచే వీనికి 'నియాండర్తల్' నరులని పేరు కలిగినది. ఈరకపువారు యూరపులో చాల శతాబ్దముల వరకుండి యుండిరి.

అప్పుడు మన ప్రపంచపు శీతోష్ణస్థితి భూఖండ విభజన, ఇప్పటికన్న కొంతభిన్నము. యూరపుఖండమున మంచుగడ్డలు (లండనువద్దనున్న) థేమ్సునదివరకును జర్మనీ మధ్యకును, రష్యాలోనికి నావరించియుండినవి. ఆంగ్లభూమి ఫ్రాన్సుతోకలసి మధ్య జలము లేకుండెను. అప్పటికి మధ్యధరాసముద్రమును, ఎర్రసముద్రమును, మైదానపు లోయలుగ నుండినవి. వీనిలో లోతైనచోట్ల మాత్రము సరస్సులేర్పడియుండవచ్చును. ప్రస్తుతపు నల్లసముద్రమునుండి, దక్షిణరష్యాగుండా, మధ్య ఆసియా లోపలివరకు, వేరొక గొప్ప భూమధ్యసముద్ర ముండినది; స్పెయిను, యూరపు

చతుర్థ హిమయుగాంతమున యూరపు పశ్చిమఆసియాల దృశ్యము
(సుమారు 50,000 ఏండ్లక్రితము.)



దక్షిణభాగముగూడ, అతిశీతలముగనుండెను. ఉత్తరఆఫ్రికా కు వచ్చినపుడుమాత్రము, సమశీతోష్ణముగ నుండెను. అప్పటి దక్షిణయూరపులో చిన్నమొక్కలేగల చల్లని మైదానములయందు, రోమావృతములగు 'మ్యామత్ 'ఖడ్గ మృగము, మహాఋషభములు, తెల్లదుప్పులు, వేసవిలో ఉత్తరమునకు, శీతకాలమున నింకను దక్షిణమునకు, వచ్చి పోవుచుండెను.

ఇట్టిపరిస్థితులలో నియాండర్తలు నరుడు చిన్న మృగములజంపియు, కందమూలఫలముల గొనియు, ఎట్లో జీవించుచుండెను. వానిచదునైన క్లిష్టదంతములబట్టిచూడ, శాకాహారియై మూలములను మొలకలను హెచ్చుగా తిని, నమలుచుండెనని తోచును. కాని వానిగుహాలలో మహామృగముల కొవ్వుగల పెద్దఎముకలు, కొవ్వునిమిత్త మై పగులగొట్టబడియున్నవి. ఆ క్రూరజంతువుల నెదుర్కొని చంపలేక, ఏనదిమూలనో నక్కియుండి, బల్లెములతో పొడిచియో, వాటిదారిలో గోతులద్రవ్వియుంచి చంపి యో, లేక భీకరమృగములు తమలో పోరాడి, కొన్ని చనిపోగా, వెనుకనుండి నక్కవలెచేరి, ఆశవముల దనగు హాలలోనికి గొంపోయియో, అతడు తినియుండును; లేక చిర

కాలము శాకాహారియయ్యు, దుర్భరశీతలపరిస్థితులందు, జంతుమాంసముకై వానిజంపి తినియుండవచ్చును.

రోమావృతుడై భీకరుడగు ఈనారసింహుడు, నిల్చి నడుచుటకు కాళ్లు చేతులుగూడ నుపయోగించెను; ఒంటరిగనో చిన్నకుటుంబముగనో సంచరించియుండును; అతనికుండిన దౌడతో మనుష్యులవలె మాటాడ వీలులేదు.

వేలకొలదియేండ్లీనారసింహజాతియే శ్రేష్ఠజాతిగ నుండెను. తరువాత 30 లేక 35 వేల యేండ్లక్రిందట శీతోష్ణస్థితి బాగుపడెను; అంతట దక్షిణమునుండి అంతకన్న జ్ఞానవంతులు సంభాషణశీలురు పరస్పరసహకారులునగు, ఇతరశాఖవారువచ్చి, వీరిని వీరిగుహాస్థలమునుండి లేవగొట్టిరి. ఉభయజాతుల కొకేరీతి యాహారమగుటచేకూడ, పోటీ అధికమైయుండును. ఈక్రొత్తవారు దక్షిణపువారో తూర్పువారోగాని, 'నియాండర్తలరు'ల వెంబడించి, రూపుమాపిరి. వారు నరజాతివారే; వారిమెదడు, బొటనవ్రేళ్లు, మెడలు, పండ్లు, కేవలము మన అవయవముల పోలియున్నవి. 'క్రొమాగ్నను' వద్దను, 'గ్రిమాల్టు' వద్దను కనపడిన వీరి అస్థికంజరములు, ఇప్పుడున్న ప్రథమ నరశేషములు; ఈరీతిగా శిలాశేషములందు మనజాతి స్పర్శకలిగి, ఇకనుండి మానవచరిత్ర ప్రారంభమైనది.

అప్పటికింకను శీతముగనున్నను, ప్రస్తుతపుప్రపంచమునకు కొంతపోలిక కలిగినది. హిమయుగకాలపు మంచు మరల తగ్గి, ఫ్రాంసు స్పెయిను దేశములందుండిన ధవళహారిణములుపోగా, ఆస్థలములు తృణసస్యయుతములైన కొలదిని, ఆప్రాంతములందు అశ్వబృందములు వ్యాపించెను. ఇదివరలోనుండిన 'మ్యామత్'మృగములు ఉత్తరప్రాంతములకు తొలగి, క్రమముగా క్షీణించిపోయినవి.

శుద్ధనరజాతి భూమిపై మొదట నేప్రాంతమునజనించెనో తెలియదు. దక్షిణాఫ్రికాలోని 'బ్రోకెన్‌హిల్'అను చోట విచిత్రరూపముగు పుర్రె, కపాలశకలములు, 1921 వేసవిలో దొరికినవి. ఇవి యిదివరలోని 'నియాండర్తలరు'లకును, శుద్ధమనుజులకును, మధ్యరకమగు నొకమూడవ జాతివి. మెదడు నియాండర్తలరు దానికన్న ముందరపెద్దదిగను, వెనుకటిభాగము చిన్నదిగను ఉండి, మనవాటిని పోలియున్నవి. కపాలమును మనదానివలెనే, వెన్నెముకపై సరిగా నిలచియున్నది; పండ్లు, నరములు, నరులరీతిగనే యున్నవి; కాని మొగము పెద్దకనుబొమలతో నడునెత్తి నుండి, రోమపంక్తితో కోతిరీతిగ నుండియుండును. ఈ రొడీసియను నరుడు 'నియాండర్తలరు'నికన్న శుద్ధనరునెక్కువ పోలియుండును. ఈరొడీసియను శాఖగాక, నరవానర

జాతులమధ్య నింకనెన్నియో ఉపశాఖలు, హిమయుగారంభము మొదలీమధ్యభాగమున, కలిగి యుండవచ్చును. శుద్ధనరుడు వీరందరికి వారసు, వీరి వినాశకుడు అయ్యెను. ఈరోడీసియను కపాలము మిక్కిలి పురాతనము కాదేమో; ఇప్పటికింకను దానిసరియగుకాలము నిర్ధారణకాలేదు. ఈజాతి దక్షిణఆఫ్రి. కాలో నిటీవలివరకు నశింపక మిగిలియుండవచ్చును.

---

# 11

## నరజాతియారంభము (వామనయుగము.)

వైజ్ఞానికుల కిప్పటికి తెలిసినంతవరకు, కేవలనరుల మొదటిచిహ్నము పడమటి యూరపులో (అందుముఖ్యముగ ఫ్రాంసు, స్పెయినులలో) దొరికినవి. ఈరెండుదేశములలో, ప్రధానముగ స్పెయినులో, 30 వేలయేండ్లక్రిందటి నరుల నరములు ఆయుధములు, రేఖలుచెక్కి తయారుచేసిన ఎముకలు, శిలాచిత్రములు కనబడినవి.

అనేకపరిశోధకులు అన్నిజాపతుల పురాతనవస్తువులను పూర్తిగ పరీక్షించినమీదట, ప్రపంచమందు పురాతత్వజ్ఞులింకను ప్రవేశింపని ఇతరదేశములలోగూడ పరీక్షలు జరిగినమీదట, ఇంకను చాలఆధారములు దొరకును. ఇప్పుడున్నవి బహుస్వల్పము. ఈవిమర్శలింకను ప్రారంభదశలోనే యున్నవి. ఆఫ్రికా ఆసియాలలో చాలభాగములింతవరకు విజ్ఞులెవరును చూచి పరిశోధింపలేదు; కొన్ని ప్రదేశములకు వెళ్లనేలేదు. అందుచే నరజాతి పశ్చిమయూరపులోనే ఆరంభించెనని నిశ్చయించుట పొరపాటు. అన్నిటికన్న ప్రాచీనములగు నరదేహచిహ్నములు ఆసియా ఆఫ్రికాలలోను, ఇప్పుడు సముద్రమగ్నములైయున్న ప్రాంతములందును ఉండవచ్చును. ఒక్కపన్నుమాత్రమే తప్ప

ప్రథమశాఖజీవులు అనగా తోకలేనికోతులు మహావాన రులు నియాండర్తలీయులు ప్రథమనరులు అమెరికాలో నుండిన చిహ్నమేమియు దొరుకలేదు. అందుచే నిచ్చట అమెరికాపే రెత్తలేదు. పూర్వార్ధప్రపంచమందే యీజాతి యంతయు నుదయించెను. ప్రాచీన శిలాయుగాంతపు నరులు బెహరింగు జలసంధివద్ద పూర్వముండిన భూభాగముమీద (ఆసియాలో ఆగ్నేయమూల) నుండినడచి, అమెరికా ఖండములోనికి ప్రవేశించియుందురు. యూరపులోని యీ మొదటి నరజాతిలో, ఆనాటికే అధమము రెండు ముఖ్య శాఖలుండినట్లు కనపడును. వీరిలో నొకశాఖవా రున్నత కాయులు; వీరిమెదడు పెద్దది; వీరిలో నొక స్త్రీపుర్రె ఇప్పటి మామూలుమనుష్యుల కపాలముకన్న పెద్దది. ఒకపురుషుని కంకాళపుఎత్తు ఆరడుగుల పైగానున్నది, వారి శరీరాకారము ఉత్తరఅమెరికా ఇండియనుల బోలి యున్నది. ఈనరదేహశేషములలో మొదటివి 'క్రొమగ్న ను' అనుచోట దొరకినందున, ఈశాఖనరులకు 'క్రొమ గ్నర్డు'లని పేరిడిరి. వా రనాగరకులైనను, ఉన్నతులై యుందురు. గ్రిమాల్టీ గుహలోని రెండవజాతివారు నీగ్రో జాతివారు, ఇప్పటి ఆఫ్రికను 'బుష్మనులు' 'హాటెంటా టు'లు ఈశాఖవారు. మనకు తెలిసియున్న ప్రారంభదశ

లోనే మనుష్యులట్లు రెండు భిన్నజాతులవారుగా నుండుట చిత్రము; వీరిలో మొదటిశాఖ ప్రపంచపు తూర్పు ఉత్తరభాగములనుండి వచ్చిరని గోధుమవన్నెవారని, రెండవశాఖవారు దక్షిణ మధ్య ప్రాంతములవారు నల్లని వారని, ఊహింతురు. కాని అట్లు నిర్ణయింపదగు ఆధారములేదు. సుమారు 40 వేలయేండ్ల క్రిందనుండిన యీ అనాగరకులు నత్తగుల్లలతో కంఠహారముల జేసికొనిరి; దేహమున పచ్చలు పొడుచుకొనిరి; అస్థిమూర్తులను శిలా విగ్రహములను తయారుచేసుకొనిరి. వానిపైనను, చక్కని రాతినేలలపైనను, వారుచెక్కిన విగ్రహాదిచిత్రములు వికృతములుగ నున్నవి; వానిలో నేర్పు పనితనము మాత్రముగలవు. వీరియుపకరణములు నియాండర్తలరుల వాని కన్న చిన్నవై, రకరకములుగానున్నవి. వీరప్పటికి పచ్చిక బయళ్ల చరించు గడ్డముగల అశ్వములను, అడవిదున్నలను, వేటాడి జీవించుచుండిరి. వారు 'మామత్తు'లను రోమావృత గజముల మనోహరచిత్రముల లిఖించిరి. ఒక సందిగ్ధచిత్రము బట్టిజూడ వాని నీచరులు మాటువేసి చంపినట్లు తోచును.

వారీటెలతో రాళ్లతో వేటాడిరి; కాని విలు విద్య అలవడినట్లులేదు. అప్పటికి వారు జంతువుల మచ్చిక

చేయుటయు లేదేమో! వీరికి కుక్కలు లేవు. కల్లము పెట్టినట్లుండు గుఱ్ఱమునకు చర్మము చుట్టినట్లు కొన్నిచిత్రములుకలవు; కాని, ఆదేశకాలముల గుఱ్ఱములు నరవాహనము లగుటకు వీలుండదు. అవి పెంపుడువైనను, వానిని వెంటదీసికొని పోయియుందురు; జంతుక్షీరము త్రాగు ప్రకృతివిరుద్ధాభ్యాసముకూడ వారికింకను కలిగియుండదు. వారు గృహముల నిర్మింపక, చర్మములతో డేరాలు వేసుకొనియుండరు; మట్టిబొమ్మలుచేసుకొన్నను, కుండలు చేసుకొనుటలేదు; పచనపాత్రలు లేనందున, వంట యింకను లేదో, లేక, అగ్నిలోనే వేపుచుండిరో! వారికి వ్యవసాయము, గంపలల్లుట, బట్టలనేత, తెలియదు. చర్మము బొచ్చు తప్ప, వేరు దేహాచ్ఛాదనలేదు.

ఈ జాతివారు యూరపుమైదానములలో నిట్లు రమారమి నూరుశతాబ్దులుండి, ఇంతలో శీతోష్ణస్థితి మారగా, ఆస్థలముల విడచిరి. శతాబ్దములు గడచినకొలది, ఎండ, వాన హెచ్చుచుండెను. ధవళహరిణములు, వీని వెనుక కారెనుములు, గుర్రములు ఈశాన్యప్రాంతములకు పోయెను. మైదానములందు మహారణ్యములేర్పడి, ఈజంతువులకు బదులు, ఎర్రదుప్పులు వచ్చినవి. క్రొత్తపరిస్థితులలో క్రొత్త పనిముట్లు వాడుకలోనికి వచ్చెను. నదులందును,

సరస్సులందును, నదులు ముఖ్యముగా చేపల బట్టుచుండిరి. నరములతో చక్కని పనిముట్లు చేయబడెను. ఆకాలపు నరముల సూదులు తరువాత 'రినస్సెన్సు' †కాలమువర కున్న వాటికన్నను, ప్రశస్తములు; అట్టిసూదులు రోమను లకుగూడ నెన్నడును లేవు, అని 'డిమోర్ట్రిలెట్టు' చెప్పియు న్నాడు.

రమారమి 15 లేక 20 వేలయేండ్లక్రితము, దక్షి ణ స్పెయినులోని కొకనూతనశాఖ మనుష్యులు ప్రవేశిం చిరి. శిలాతలములపైన వారు చిత్రించిన చమత్కారచిత్రము లిప్పటికి నున్నవి. ఈబొమ్మలున్న "మాస్‌డ్ అజిల్" అను గుహనుబట్టి వారిని 'అజిలియను' లనుచున్నాము. వీరు ధనుర్ధరులు; శిరములం దీకల ధరించిరి. చిత్రలేఖనమేగాక సంకేతచిత్రములగూడ వ్రాయుచుండిరి. మనిషిని సూచిం చుటకు పెద్ద నిలువుగీత, రెండుమూడు చిన్న అడ్డుగీతలు ను, లిఖించిరి. చిహ్నము లిట్లారంభించినవని తోచును. ఒక తేనెపట్టున కిద్దరుమనుజులు పొగబెట్టుచున్నటు లొక చిత్రముగలదు.

---

† యూరపులో క్రీ. త. మొదటిమూడు శతాబ్దములైనపిదప విజ్ఞానము శిల్పకళ క్షీణించినవి. తరువాత 16 వ శతాబ్దముననే పునర్వి కాసము కలిగెను. ఈపునర్వికాసమునే యూరపుచరిత్రలో 'రినస్సెన్సు' అందురు.

వీనిపనిముట్లు చెక్కిన రాతివగుటచే, వీరిది 'పూర్వ శిలా'యుగమని చెప్పుచున్నాము. సుమారు 10, 12 వేల యేండ్ల క్రిందట, యూరపున కింకొక క్రొత్తజాతివచ్చెను. ఈక్రొత్తమనుష్యులు పనిముట్లను చెక్కి, వానినిసూరి, నునుపుచేసెడివారు. వీరు వ్యవసాయ మారంభించిరి. ఇట్లు 'నవశిలా'యుగము మొదలిడినది.

మారుమూల ఆస్ట్రేలియా ఖండమునకు దక్షిణమున నున్న టాస్మేనియా ద్వీపములో, మనుజులందరికంటె హీనమగు మనశ్శరీరములుగల, ఒక అనాగరకజాతివారు నూరేండ్ల క్రిందటి వరకుండుట చిత్రము. ఈజాతివారెవరు నిటీవల యూరపులో లేరు. భూతలపు మార్పులచేత ఇతరులతో నీటాస్మేనియనులకు రాకపోకలు లేక, వీరి యాచారాదు లాస్థితిలోనే నిల్చిపోయినవి. వీరు వృద్ధి యగుటకుబదులు, క్షీణింపజొచ్చిరి. యూరపియను అన్వేషకులకు వీరు కనబడుసరికి, వీరు నత్తలను నీచజంతువులను బట్టి తినుచు, గృహములులేక చెట్లక్రిందను, తిప్పలమీదను వసించుచు, హీనస్థితిలో నుండిరి. వారు మనవంటి మనుష్యజాతివారే. కాని ప్రథమనరజాతికుండినంతయైన హస్తనైపుణ్యము వీరికిలేదు. *

---

* నరజాతి మొదట ఏప్రాంతమందుండెనో తెలియనట్లే, మొదటి నరజాతి యెట్లుండెనో నిర్ణయించుటయు కష్టమే. మనదేశపు నేపాళము

మున్నగు కొన్ని హిమాలయప్రాంతములందు, ఇంక చాల ఇతరప్రదేశములందు, ఇంకను పరిశోధనలు జరుగలేదు. నాగరికకాలమునకు వేలకొలది ఏండ్లక్రిందటనే జనసంచారముండినట్లు దక్షిణ భారతదేశపు (తిరునల్వేలి జిల్లాలోని) ఆదిచనల్లూరు మద్రాసుపురప్రాంతము హిమాలయప్రాంతము మొదలగుచోట్లను దొరికిన ప్రాచీన శిలాయుగపు విచిత్రవస్తువులు సూచించును. అతిపురాతనకాలమునుండి పశ్చిమపంజాబు ప్రాంతమున మనుష్యజాతి యుండినట్లు కొన్ని నిదర్శనములు కనబడినవి. ఆప్రాంతమున పరిశోధనలు జరిగించుటకొరకు అమెరికను పురాతత్త్వవేత్త ఈసాలున మన భారతదేశమునకు వచ్చెను. మనదేశమున ఈ పరిశోధనలిప్పుడే ఆరంభమైనవి. పూర్వము నరజాతి ఆరంభకాలమువరకు ఆఫ్రి. కాను మన దక్షిణభారతదేశమునకు భూసంబంధముండెను. ఆ యారంభకాలపు మరుగుజ్జుమనుష్యులు ఆఫ్రి. కాలో ఉండిన చిహ్నములు కలవు. ఆఫ్రి. కాలోని యాం ప్రాణుల బోలునవి మనదేశమందును కలవని కొందరు సూచించుచున్నారు. సస్తనజాతులు పక్షులు ఆరంభమున చాల చిన్నవిగ ఉండినట్లే, మొదటి నరజాతి వారి శరీరములు అల్పములుగనే ఉండియుండునని తోచును. అట్టిచో, ఈఆదిమనరకాలమును 'వామనయుగ' మని చెప్పవచ్చును.

---

## ఆదిమజ్ఞానము.

ఆదిమజనులు ఊహ్పలు కోతలు లేక వేటతోనే కాలక్షేపమొనరించిరి. అట్టివారి ఆలోచనలు వినోదకరములై యుండును; ఆమనోభావములు లిఖితముకానందున నవి కేవలమూహ్యములు.

వానిని వైజ్ఞానికులు శ్రమపడి అనేకాధారములపై నిర్ణయించిరి. చిన్నపిల్లల భావములు అహంకారయుతములు; అవి సాంఘికజీవితపు అవసరములబట్టి నిస్తబ్ధములై మారుచు, మిశ్రితములగుచుండును. ఈసంగతిని క్రొత్తగా చర్చించి తెలుపునది 'సైకో-ఎనాలిసిస్' అనబడు భావపరిశీలనశాస్త్రము. దానివలన ఆదిమజనుల సాంఘికచరిత్రనుగూర్చి కొన్నిసంగతులు తెలసినవి. ప్రస్తుతము అక్కడక్కడ మిగిలియున్న వన్యజనుల భావములను వారియభ్యాసాచారములను చూచియు, కొన్నిసంగతుల గ్రహింతుము; ఆధునికనాగరకులలోను పూర్వపుమూఢవిశ్వాసములు, కొన్నికొన్ని గాథలును, పూర్వకథలునుగూడ, అనుశ్రుతముగా వచ్చుచున్నవి. అవియు ఆదిమజనుల మనోభావము లెట్లుండెనో సూచించును. ఆధునికకాలము సమీపించినకొలఁది, మనకున్న కొన్నిపురాతనచిత్రములు, శిలావిగ్రహములు.

సాంకేతికచిహ్నములుగూడ, అప్పటి జనుల చిత్తవృత్తి యెట్లుండెనో, వారి కేపదార్థములిష్టమో, తెలియజేయును.

ఆదిమజనులు మనపిల్లలవలె ఊహలచే విషయముల దమ మనస్సులో చిత్రించుకొనిరి. ఇప్పుడు పిల్లలు అజ్ఞానులు చేయునట్లే, వారు వస్తువుల యాకారముల మనస్సున భావించి, ఊహించి, అందునుబట్టి చరించుచుండిరి. ఇట్లు కొంతకాలమైనమీదటనే, నరులకు విచక్షణ జ్ఞానము కలిగియుండును. మూడువేలయేండ్ల క్రిందటివరకు నరులలో నట్టి జ్ఞానశక్తికి ప్రాముఖ్యము కలిగియుండదు. ఇప్పటికిని సామాన్యజనులు ఊహకు ఉద్రేకముకు లోనై, ఏకొద్దిమందియో నిర్ణయించుభావము లనుసరింతురు. పూర్వకాలపు స్తనజంతువులు మొదట చిన్నకుటుంబములుగానుండి క్రమముగా మందలుగా నేర్పడెను. అట్లే ఆదిమజనులు, మొదట చిన్నకుటుంబములుగానే యుండియుందురు. వారు తమ సహజగుణమగు అహంభావము లోబర్చుకొని, నిగ్రహయుతులు కావలసివచ్చెను; వయస్సువచ్చినతరువాత గూడ పితృభక్తి కనుబరచవలసియుండెను. తమపడుచుపిల్లవాండ్రపై సహజముగాకలుగు అసూయను ముసలివాండ్రు తగ్గించుకొనవలసి యుండెను. పిల్లలు తల్లిబోధనలోను

రక్షణలోను ఉండుట సహజమే; కాని యౌవనము రాగానే తమతల్లిదండ్రుల వదలి స్వతంత్రముగ జీవింపవలెనని తోచును; ఆబుద్ధిమాని, ఏకాకిజీవనము నష్టకరమని వారు గ్రహించిరి. అందుచే యువకులు తల్లిదండ్రులతో ఏకకుటుంబముగనే యుండజొచ్చిరి; ఇట్లు క్రమముగా జనులలో సాంఘికజీవన మారంభించెను. ఇప్పటి వనచరుల 'టాబూ'లను, ఆచారనియమములు చాలవర కిట్టి సాంఘికావసరములచే నేర్పడిన సంగతి 'జే. జె. ఆట్కిన్సను' అను ప్రతిభాశాలి యగు నరతత్వజ్ఞుడు తన 'ప్రైమల్ లా' యను గ్రంథమున వివరించెను. ఆతనినిర్ణయము, తరువాత మనఃపరిశీలన శాస్త్రజ్ఞుల సవిమర్శసిద్ధాంతములకు సరిపోయి, అందుచే దృఢపడెను.

పెద్దలపై నేర్పడు భయభక్తులు ఆదిమజనుల స్వప్నమందును ధ్యానమందును వృద్ధియై, క్రమముగా బలపడును; అట్టివి క్రమముగా ఆదిమనరుల మతమునకు గ్రామదేవతల పూజకు మూలకారణమయ్యెనని కొందరు మేధావుల యూహ. ప్రజోపకారులై అద్భుతశక్తియుతులైనవారి యందు, ఆదిమజనులు భయభక్తులతో నుండిరి. ఆశూరులు మరణించినతరువాతగూడ, కలలోజ్ఞప్తివచ్చుచుండుటచే, ఆభయభక్తులు వృద్ధియై, మహావీరుడగు తమనాయకుడు

చనిపోలేదనియు, ఐహికజీవితము మాత్రమే త్యజించి, దూరస్థలమున ఇంతకంటె అధికశక్తితో అదృశ్యుడుగ నున్నాడనియు, వారు సహజముగ నమ్మిరి. పిల్లలస్వప్న భ్రాంతి, భయములు, పెద్దలకుగలుగువానికన్న స్థిరముగాను స్ఫుటముగాను ఉండును. ఆదిజనులమనస్సును మనచిన్న పిల్లల మనస్సువలె నుండెను. ఇదిగాక మృగజాతిసహవాసముచే, అట్టియుద్దేశములు ప్రతీకారబుద్ధులు జంతువులకు నుండుననియు, వానిలోను తమకు మిత్రులు శత్రువులుఅగు అధిదేవతలుండురనియు, వారికి తోచియుండును; విచిత్ర వికృతాకారములగు శిలలు, కర్రముక్కలు, విచిత్రవృక్షములవంటివి, విశిష్టములుగాను భావగుంభితములుగాను తోచి, విరోధిగానో యిష్టముగానో కనబడును; వానిని గూర్చి కలలు ఊహలు కలిగి, అంతట వానినిగూర్చి కథలు గాథలు ఏర్పడును. ప్రాచీనశిలాయుగపు మనుష్యులకెక్కున నమ్మిక కలిగియుండును; ఈసంగతులు బాల్యమున ఊహ హెచ్చుగనుండినవారు గ్రహింపగలరు. జనులట్టిగాథల లో గొన్నింటిని జ్ఞప్తియందుంచుకొని, మరలమరల చెప్పు చుందురు. స్త్రీలు తమపిల్లల కథలను జెప్పుచుండుటచే అవి అనుశ్రుతములై, ఐతిహ్యముగ నేర్పడును. ఊహగల పిల్ల లనేకులు తమకిష్టమగు బొమ్మనో మృగమునో నరసమ

ప్రాణినో కథానాయకునిగ నెంచి, కథలనూహించి చెప్పుచుందురు. ఆదిమనరులు నిట్లేచేయుచు, తమకథానాయకుడు యథార్థమైనవాడేయని విశ్వసించియుందురు. మనకు తెలిసిన ఆదిమజనులందరిలో మొదటివారు వాచాలురని తోచును. వారివిషయమున 'నియాండర్తలు' వారికన్న భిన్నులు సౌకర్యవంతులుగ నుండిరి. నియాండర్తలీయులు కేవలము మూగవారు. ఆదిమనరులు కొన్నిమాటలు చెప్పుచు, అందుకు సంజ్ఞలను తోడుజేసుకొనియుందురు.

అడవిమనుష్యులకుగూడ గొంతకార్యకారణజ్ఞానముండెను; కాని దానికి తగువిచక్షణలేక, వారొకకార్యమును, దానియథార్థకారణమువిడచి, మరియొకదానితో ముడిపెట్టుచుండిరి. "ఇట్లుచేయుము, అట్లగును" అని ఆతడనును; "మీరొకశిశువున కొక కాయనిచ్చినమీదట, ఆశిశువు చనిపోవును", "వీరశత్రునిగుండెలదినిన, బలముగలుగును"; ఇట్లెక్కడనైన నొకసారి కాకతాళీయముగ జరుగవచ్చును; కాని ఎప్పుడును అట్లేజరుగునను భావము సరికాదు. అడవిజనులకుండు ఈ ఊహ భ్రమయేకాని, ప్రమకాదు. అది విచక్షణజనితముకాక, తరచు తప్పిపోవును; అది తర్కశాస్త్రసిద్ధముకాదు.

ఇట్టివానిలో చాలవరకు సరియైన కార్యకారణ సంబంధములు గ్రహించుట కష్టముకాదు. కొన్నిటిలో అనుభవముచే భ్రాంతితొలగును. కాని జీవితప్రధానముగు సమస్యలకు వారు యత్నముపై కొన్నివిచిత్ర దృఢవిశ్వాసముల నేర్పర్చుకొనిరి; అట్టివి సరికావనుటకు ప్రత్యక్ష నిదర్శనమున్న గాని అవి తొలగవు. తమకాహారమగు జంతువులు మత్స్యములు సమృద్ధిగా దొరుకుట ఆదిమ జనుల కవసరము. అట్టి కార్యానుకూలతకై, అనేకమంత్రములు, తాయెత్తులు, శకునములు, ఇత్యాదులందు వారికి దృఢవిశ్వాస ముండెను. వ్యాధి, మరణములు అడవిజనులకు ముఖ్యసమస్యలే. దేశమం దంటువ్యాధులు వ్యాపించి యనేకులు చనిపోవుదురు; చాలమంది ప్రత్యక్ష కారణములు లేకయే దుర్బలులగుదురు. అట్టిస్థితిలో ఆదిమ జనులకు చిత్తవిక్షోభము, ఆతురత, వ్యాకులత, కలుగుచుండెను; స్వప్నాదులచే దేనిమీదనో అపోహలుకలిగి, వారు పిల్లలవలె భయస్థులై, ఏజంతువో మనుష్యుడో కాపాడవలెనని యపేక్షించిరి. భయశీలురయ్యు వారిలో అనుభవస్థైర్యయుతులైనవారు ఇతరులకు బోధకులు నాయకులునైరి. కొన్నిచిహ్నములు శకునములు శుభప్రదములని, కొన్నిహానికరములని, నిర్ణయించు మంత్ర

తంత్రజ్ఞులు వైద్యనిపుణులు కులగురువు లైరి. ఈనాయ కులు స్వప్నఫలితములను భవిష్యత్తును చెప్పుచు, దుర్నిమిత్తముల దోషముల బోగొట్టి యదృష్టలాభము గల్గించుటకై, క్లిష్టమంత్రతంత్రముల నేర్పు చుండిరి. ఆదిమమతమునందు ఆచారానుష్ఠానములే ప్రధానములు; కాని అందు యథార్థధార్మికభావము లేదు. అప్పటి మతగురువులు స్వచ్ఛందము అనుభవసిద్ధము అగు సూత్రములనే విధించుచుండిరి.*

* అనాగరికదేశములం దిప్పటికిని పైన చెప్పినభావములు ప్రబలముగా నున్నవి; అవి వారిసాంఘిక ధార్మికవిషయములందు ముఖ్యముగ గూడనున్నవి. ఇతరనాగరికదేశములందు చాలవరకిని యిప్పుడు తగ్గినవి. కాని మనభారతదేశమందిప్పటికిని కొందరిలో అట్టిభావములు ప్రబలముగానే యున్నవనకతీరదు. ఆర్యులువచ్చునప్పటికే, ఆదిమజనులు ద్రావిడులు కలసి చిరకాలముండిరి; అందుచే, ద్రావిడులందరిలోను ఆదిమజనుల నమ్మికలు, భావములు పూర్తిగా వ్యాపించినవి; ఈమిశ్రితద్రావిడ నాగరికత భౌతికముగా చాల యుచ్చదశలో నుండుటచే, ఆర్యులనాగరికత దీనిని తొలగింపక, అందుకొన్నిమార్పుల మాత్రము కావించెను. తాయెత్తులవిశ్వాసము, శిలలందును కర్రదిమ్మలందును చెట్లయందును మనగ్రాములలో అజ్ఞానులకుండు మూఢభయభక్తులు, దయ్యములభీతి, అందరెరిగినవే. మంత్రశాస్త్రములందలి కొన్నిభావములు శత్రుసంహారమునకై చేయు మంత్రోచ్చాటనలు, అభిచారహోమాదులుగూడ,ఇట్టివే. అథర్వవేదమందలి చాలమంత్రతంత్రములం దీభావములు ప్రాముఖ్యము వహిం

చియున్నవి. (అధర్వసంహిత చాలప్రాచీనమే; ప్రాచీనార్యులలో గూడ క్రిందితరగతులలో కొంతవరకీభావములు మొదటినుండి కొంచముగా నుండినవి; కానిచాలవరకు ఆదిమద్రావిడనాగరికత యొక్క సంపర్కప్రభావము గూడ ఈగ్రంథమందు స్పష్టముగనున్నదని విమర్శకుల అభిప్రాయము. ఇతరనాగరికదేశములలో వలెగాక, మనదేశమున నూటికి 92 మందికి అక్షరజ్ఞానముగూడ లేదు. తక్కిన 8% లోగూడ నిజమగు విద్యావంతులు చాల తక్కువ; కనుక ఇట్టి అజ్ఞాన మూఢభావములు మన దేశమందలి కొందరుజనులలో, (ముఖ్యముగా మాలమాదిగలవంటి నిమ్న జాతులలోను కోయలు మొదలగు ఆటవికులలోను), చాలప్రబలముగనున్నవి. అనేక దురాచారములింకను మనజాతిలో వ్యాపించియున్నవి. ఆభావములు ఆచారములువారితో సాంఘికసంపర్కముగల ఇతరజాతులను వ్యాపించుట సహజము. కొందరు విద్యావంతులలో గూడ అక్కడక్కడ ఇట్టిభావములు నేటికిని లేకపోలేదు.

---

## కృష్యారంభము.

ప్రపంచమున వ్యవసాయ మారంభమై స్థిరపడిన విధముగూర్చి, 50 యేండ్లనుండి చాల పరిశోధన చర్చ జరిగెను; కాని ఇంతవరకు అది సరిగా తేలలేదు. క్రీ. పూ. 12 వేలు 15 వేలు మధ్యను 'అజీలియను' జనులు స్పెయినుదక్షిణ మందుండిరి; అంతకు వెనుకటిమృగయు లీశాన్యసీమలకు దొలగుచుండిరి; అప్పుడు పశ్చిమ ఆసియా ఖండమందో ఉత్తరఆఫ్రికాలోనో, ఇప్పటి మధ్యధరా సముద్రముగానున్న అప్పటి లోయలందో, ఆప్రాంతపు జనులు వ్యవసాయమును జంతువులమచ్చికను ఆరంభించిరని తలపవచ్చును. అంతకు పూర్వపుమృగయుల చెక్కును రాళ్లనేగాక, నునుపుచేసిన రాతి పనిముట్లనుగూడ వీరు వాడుచుండిరి. గంపలల్లుట, నారపోగులతో ముతుకపంచలనేయుట, మోటురకపు కుండలజేయుట కూడ, వారు నేర్చుకొనిరి.

ఇప్పుడు మానవసంస్కృతిలో నొకనూతనశక మారంభమైనది. ప్రాచీనశిలాయుగపు పూర్వార్ధమగు ఉదయశిలాకాలము, ఉత్తరార్ధమగు ఆదిమనరకాలము, అనగా "గ్రిమాల్డీ"లు "క్రొమాగ్నర్డు" లు "అజీలియనులు"

అనబడువారి తరువాత కలిగిన ఆనవశిలాయుగపు జనులు ప్రపంచమంచలి వెచ్చనిదేశములందు వ్యాపించిరి. వారభ్యసించిన కళలు, వారుపెంచిన వృక్షములు, జంతువులు, ఇతరప్రాంతములందుగూడ వ్యాపిచినవి. క్రీ. పూ. 10 వేల యేండ్లక్రిందటి లోకు లీనవశిలానాగరికతలో నుండిరి.

భూమి గుండ్రదనము నిస్సందేహమని ఆధునికులకు దోచునట్లు, నేల దున్ని విత్తనములు జల్లి, కోత కోసి, నూర్చుట, పిండివిసరుట, సహజకార్యములని మనకు తోచును. వ్యవసాయము చేయకుండుటేమని మనవారడుగవచ్చును. కాని మనకంత విశదము సహజము అని తోచు యీకెండుసంగతులును, 20 వేల యేండ్లక్రిందటి ఆదిమజనులకట్లు తోచలేదు. తమయత్నములలో అనవసరశ్రమ పొరబాట్లు పడుచు, వానిని కష్టముతో సవరించుకొనుచునే, వారు చివరకు కృతకృత్యులైరి. వారు మధ్యధరాప్రాంతపు టడవిలో సహజముగా పండిన గోధుమల పిండిగా నలుగగొట్టి దానిని భక్షింప నేర్చియుందురు. తరువాత కొంతకాలమునకే గింజలు జల్లి, పండించ నేర్చిరి. ఇట్లాప్రథమనరులు కోతకు తరువాతనే విత్తులజల్లిరి.

ప్రపంచమంతటను విత్తుట కోత యుండిన ప్రతిస్థలమందును, అప్పుడు యాగము, అందు జీవహింస నరమేధముగూడ, జరిగియుండుట గమనింపవలెను†. ఈ రెంటికినిగల విచిత్రసంబంధమును దానికారణమును సర్. జె. జి. ఫ్రేజరుగారు 'గోల్డెన్ బవ్' అను తమ యుద్గ్రంథమున జక్కగ విమర్శించిరి. పిల్లలవలె కలగనుచు గాథల నూహించు ఆదిమనరులు తమఊహలచే అట్టిసంబంధము నేర్చిరి. దాని కార్యకారణభావము మనకు స్పష్టముకాదు. కాని నవశిలాయుగపు ప్రాచీననరులు విత్తులుజల్లుకాలము వచ్చినపుడెల్ల నరబలి నిచ్చుచుండిరి; మరియు, ఏపనికిరాని వానినో గాక, చాలమాన్యుడు పూజ్యుడనగు యువకునే బలియిచ్చెడువారు. వానిని యజ్ఞార్థపు దేవాంశిక ప్రభువుగా భావించి, జ్ఞానులనబడినవారు వారియాచార

† మనభారతదేశమునగూడ ఓఢ్రప్రాంతపు ఖోండులు మొదలగు ఆటవికజనులలో మంచిపంటలనిమిత్తమై విత్తుటలోను, కోతలలోను, నరబలియిచ్చుపద్ధతి యిటీవలివరకుండెను. ఇప్పటికిని ఋతువులందు పోలేరమ్మ, ముత్యాలమ్మ, గంగానమ్మ మున్నగు గ్రామదేవతలకు సాలీనా నిమ్నజాతిచేయు యుత్సవములందు దున్నలు, మేకలు, వధింపబడి, జంతుబలికి ప్రాధాన్యమీయబడును. మనప్రాంతమున మాలమాదిగలు జరుపుచుండు 'పోతురాజు' ఉత్సవములోను, నీలగిరి ప్రాంతపు బడగలు మొదలగు ఆటవికుల ఉత్సవములలోను ఇట్టివికలవు.

ప్రకారము కర్మకాండతో నాయువకునో యువతినో బలి యిచ్చుచుండిరి.

ఆదిమజనులకు ఋతుజ్ఞానము లేను; వ్యవసాయమునకు ఆయజ్ఞమునకు తరుణము దెలియుట కష్టమై యుండును. ఆకాలపునరులకు ఏడాదియన లెక్క తెలియదేమో! మొదటికాలక్రమనిర్ణయము చాంద్రమానపు నెలల ప్రకారమే జరిగియుండెను. బైబిలులోని పాచీను లేర్పరచిన వత్సరములు చాంద్రమానపువనితోచును. బాబిలోనియనుజాతివారి పంచాంగమున, చంద్రగతిని యేడాదిని పదమూడు నెలలుగా విభజించి, విత్తుజల్లుకాలము నిర్ణయించిరని తోచును. పంచాంగనిర్ణయమున చాంద్రమానసంబంధ మిప్పటికిని కలదు. ఏసుక్రీస్తును కొరతవేసిన దినమునకును, ఆయన పునరుద్ధారణ దినమునకును, క్రైస్తవులు సాలీనా జరుపు పండుగలిప్పటికిని చంద్రగతి ప్రకారమే జరుపుట విచిత్రము. అందుచే నవి ప్రతిసాలున నొకేతేదీని రాక చంద్రగతినిబట్టి మారుచుండును.

మొట్టమొదటి సేద్యదార్లు నక్షత్రస్థానముల గమనించిరని చెప్ప లేము. దిక్కులు తెలియుటకు నక్షత్రస్థానములు సహాకారులు; కనుక, సంచారశీలురగు గోపాలకులు నక్షత్రముల మొదట గమనించియుందురు. అయితే నక్షత్ర

స్థానములబట్టి ఋతువుల నిర్ణయింపవచ్చునని తెలియగా నే, వ్యవసాయమునకు నక్షత్రముల ఉపయోగము బోధ పడియుండును. ఫలానా ముఖ్యనక్షత్రము ఫలానా దిక్కుగా నున్నపుడు విత్తుల జల్లునప్పటి యజ్ఞముకావలెనని స్థిరపరచిరి. అందుచే ఆ నక్షత్రకథలు నక్షత్రపూజలు ఆదిమనరులలో నారంభించుట సహజమే. మఱియు నీ నవ శిలాయుగమున నక్షత్రజ్ఞానముకల్గి ఆబలివిధి తెలిసిన వాడు ప్రముఖుడై, తక్కినవారికి సహజముగా నాయకుడగుచు వచ్చెను.

మైల, అపరిశుద్ధత, ప్రమాదకరములు; అందుచే, శుద్ధి కవసరమగు పద్ధతుల నేర్పరచుటకు, వారిలో జ్ఞానులన బడువారు ఉద్యుక్తులైరి. మొదటినుండి మాంత్రికులలోను గురువులలోను పురుషులు స్త్రీలు కూడ నుండిరి. మొట్ట మొదటిగురువులు ముఖ్యముగా సంప్రదాయజ్ఞులేకాని, ఆధ్యాత్మికజ్ఞానులుకారు. కేవల అనుభవజ్ఞానము, నిగూఢముగా నుండదు; అజ్ఞానమును గురువులు గూఢముగ నుంచుచుండిరి. అయినను ఆ గురువు లప్పటి సాంఘికావసరముల కుపయోగించుచుండిరి.

సుమారు 12 లేక 15 వేల యేండ్లక్రిందట, పూర్వార్ధప్రపంచమున జలాతపసమృద్ధిగల ప్రాంతముల 'నవ

శిలా' యుగజనులు తమ పూజారులు నియమించు మతా చారములతో వ్యాపించుచు, అచ్చటిభూముల వ్యవసాయ ముచేయుచు, గ్రామములను చిన్నపురములను నిర్మించుకొని, తరుచు ఆపురముల రక్షణకై ప్రాకారముల కట్టుకొనుచుండిరి. కొంతకాలము గడచి వారిసంఘముల సమావేశములు జరిగినపుడు, పరస్పరము సంప్రదింపులు జరుగుచుండెను. ఈ మొదటి కర్షకుల సంస్కృతికి 'హెలియో లిథిక్' (సూర్యశిల) నాగరికత అని ఎలియట్ స్మిత్, రివర్సులు పేరిడిరి. ఆ పేరీజనుల కంతయుక్తముగా లేదు; కాని వైజ్ఞానికు లంతకన్న యుక్తతరమగు పదమును నిర్ణయించువరకు, దీనినే వాడుచుందుము. మధ్యధరాసముద్ర ప్రాంతముననో, పశ్చిమ ఆసియాలోనో, ఉత్పన్నమైన యీ నాగరికత కాలక్రమమున తూర్పునను, శాంతమహాసముద్రపుదీవులలోనికిని, వ్యాపించినది. ఇది ఉత్తరప్రాంతములనుండి అమెరికాలోనికి వచ్చి, అంతకుముందే ఆసియా నుండి ముందువచ్చిన వనచరులతో కలసిపోయి యుండును.

ఈ గోధుమవర్ణులగు "సూర్యశిలా" జాతివారు వెళ్లిన ప్రతిస్థలమునను, వారి ఆచారవ్యవహారములు వ్యాపించెను. వీనిలో కొన్ని విచిత్రమైన వెట్టుపుట్టెనో, మన శాస్త్రజ్ఞులు వివరింపవలె. వారు పిరమిడ్లను సూచ్య

గ్రమందిరములను, గొప్ప దిబ్బలను, గట్టిరి; మహాపాషాణములతో వలయముల నేర్పరచిరి; వీటిని జ్యోతిశ్శాస్త్ర పరీక్షకై చేసియుండవచ్చును. వారు సాధారణముగ తమ మృతుల శరీరములన్నిటిని తైలాదులంకరించి, భద్రపరచెడివారు. వీరిలో పచ్చపొడుచుటయు, సున్నితీచేయుటయు, ఉండెను. శిశువు జనించగానే తండ్రి దాని ప్రక్కలో పరుండెడు "కోవాడె" అను ఆచారముగూడ వీరిలో యుండెను. వీరిలో 'స్వస్తిక' అను అదృష్టచిహ్న వస్తువుండెడిది.

వీరిఆచారవ్యవహారము లెంతవరకు వ్యాపించెనో, గుర్తు వేసి చూపినచో (ఇంగ్లాండులోని) 'స్టోనుహెంజి' స్పెయినుదేశము ప్రపంచములోని సమశీతోష్ణపు ప్రదేశములు దాదాపు అన్నియు, అనగా అమెరికాలోని 'మెక్సికో' 'పెరూ' దేశములవరకు నిందు చేరును. ఆఫ్రికాలో భూమధ్యరేఖకు దక్షిణప్రాంతమును, మధ్య యూరపులోని, ఉత్తరభాగమును, ఉత్తర ఆసియాయు, చేరవు. అందు వేరు సంస్కృతిగలవా రుండిరి. *

---

* సూర్యశిలా నాగరికత, గోధుమపంటలు, చిరకాలము క్రిందనే భారతదేశపు పశ్చిమభాగపు గాంధారప్రాంతమున నుండిన నిదర్శనములు గలవు. అందుచే సూర్యశిలా నాగరికత మొదట ఏదేశమం దారంభించెనో లేక భారతదేశమందును పశ్చిమమందను వేరువేరుగా ఏక

కాలమందే ఆరంభించెనో, ఇంకను నిర్ణయముకాలేదు. మనదేశమందును ప్రాచీనకాలమున చంద్రగతినిబట్టియే కాలనిర్ణయము చేసుకొనుచుండిన నిదర్శనములు గలవు. నేటికిని మన ఆంధ్ర కన్నడదేశములందు చాంద్రమానమే వాడుకలో ఉన్నది. విత్తులుజల్లుట ఊడ్పులు వగైరాలకు మృగశిరకార్తి మొదలగు పేర్లతో నక్షత్రగతినిబట్టి కాలనిర్ణయము చేయుట నేటికిని అనుశ్రుతముగ జరుగుచున్నది.

విత్తులుజల్లు కాలమందు కోతలలోను మంచిపంటలకై నరబలి నిచ్చుపద్ధతి మన భారతదేశములోను ఓఢ్రప్రాంతపు ఖాండులు మొదలగు అడవికొండ జనులలో ఇటీవల వరకుండెను. ఇప్పటికిని ఆ యా ఋతువులందు పోలేరమ్మ ముత్యాలమ్మ గంగానమ్మ మున్నగు ఆయా గ్రామదేవతలకు నిమ్నజాతులవారు చేయు ఉత్సవములందు దున్నలు మేకలు చంపబడును; అందు జంతుబలి ప్రధానము. మన ప్రాంతములందు మాలమాదిగలు చేయు 'పోతురాజు' ఉత్సవములలోను నీలగిరి ప్రాంతపు 'బడగ'లు మొదలగు వన్యజనుల ఉత్సవములందును ఇట్టివి కలవు. జీవహింసలేకుండ ఊడ్పులలోను మార్పులలోను పండుగచేసుకొనుట ఆర్యులలోను ఉన్నదని కర్కాటక మకర సంక్రమణములు ప్రారంభమున ఇందుకే ఉద్దేశించినవై యుండునని కొందరి ఊహ. కాని వాటికి పంటలతో సంబంధము ప్రధానముకాక, సూర్యగతిలోను అయనములోను మార్పును సూచించుటే ముఖ్యోద్దేశము కావచ్చును.

---

## 14

## అదిమ 'సపశిలా' నాగరికత.

క్రీ. పూ. 10 వేల సంవత్సరముల క్రిందట భూమి పరిస్థితి దాదాపు ఇప్పటిరీతినే యుండినది. స్పెయినుకుదక్షిణాగ్రమందున్న జిబ్రాల్టరు ప్రాంతపు సన్నని భూప్రదేశమును నీరు అప్పటికి భేదించినందున జలసంధియేర్పడి, సముద్రపు నీరు మధ్యధరాతలపు లోయలలో వ్యాపించి, ప్రస్తుత మధ్యధరాసముద్ర మేర్పడినది. కాస్పియనుసముద్రమింకను చాల పెద్దదిగనుండి, కాకససుపర్వతముల కుత్తరమున, ఇప్పటి నల్లసముద్రముతో కలసిపోయియుండును. ఈ సముద్రము చుట్టునుండిన (మధ్యఆసియాలో నిప్పుడెడారిగానున్న) దేశము లప్పుడు ఫలవంతమై, వాసయోగ్యమై యుండెను. సామాన్యముగా అప్పటినేల యెక్కువ తేమగా ఫలవంతమై యుండెను. యూరపులోని రష్యాయం దిప్పటికన్న సరస్సులు మురుగుడు స్థలములు హెచ్చుగా నుండెను. అప్పటి కింకను ఆసియా అమెరికాలు ఉత్తరభాగమున కలసియేయుండి, బెహేరింగు జలసంధి ఏర్పడలేదని తోచును.

ప్రస్తుతపురీతినే నరజాతులలో భేద మప్పుడుగూడ నుండినది. తృణకాష్టజలసమృద్ధిగల సమశీతోష్ణదేశము

లందును, తీరస్థలములందును, "సూర్యశిలా" సంస్కృతి గల యీగోధుమవర్ణులు వ్యాపించియుండిరి. మధ్యధరా ప్రాంతమం దిప్పుడున్న ఐబీరియనులు, బెర్బర్లు, ఇజిప్టనులు (=మిశ్రదేశీయులు) ప్రాచ్యదక్షిణాసియాలోని భారతదేశపు ద్రావిడులు మొదలగువారు సుమత్రా, జావా, బోర్నియో, మొదలగు బృహద్భారతవాసులును, ఫిలిప్పైను మొదలగు శాంతమహాసముద్రపు ద్వీపవాసులు, మయోరీలు కూడ నీమహాజాతిశాఖలవారే. ఈ గోధుమవర్ణజాతి నుండి విడిపోయి, ఇంతకన్న కొంత తెల్లనై నీలికండ్లుగల, ఒకశాఖవా రుత్తరయూరపుమధ్య అడవులలో గలరు. వీరిని నార్డిక్ (ఆర్య) జాతీయులనెదరు. ఆసియాఖండపు ఈశాన్యదేశమందు (వామనేత్రములు, ఊర్ధ్వచుబుకము స్వర్ణదేహచ్ఛాయ, దీర్ఘశ్యామశిరోజములుకల) మంగోలియను లను మరియొకజాతివా రుండిరి. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియా, దక్షిణాసియాలలోను, ఉష్ణదేశద్వీపములందును నీగ్రోజాతీయు లుండిరి. ఆఫ్రికా మధ్యప్రాంతమున అప్పటికే జాతిసాంకర్యము కలిగెను; ఆఫ్రికాలో చాలమంది గోధుమ వర్ణపు ఉత్తరజాతి, శ్యామవర్ణపు నీగ్రోజాతి, వీటి మిశ్రితులుగా నున్నారు.

వేర్వేరు జాతులవారైనను స్త్రీపురుషనరులు పరస్పరసంయోగము కలిగి నిరాటంకముగ సంతానము గనవచ్చును; అది ప్రకృతిసిద్ధము. అందుచే, ఆకాశమున మబ్బులు విడిపోయి తిరిగి కలియుచుండునట్లే, మనుష్య జాతులును కాలక్రమమున విడిపోయి, తిరిగి సమావేశమై, మిశ్రితులగుచుందురు. మానవజాతులు శాఖలుగా విడినను, వృక్షశాఖలవలె తిరిగి కలియ వీలులేకపోదు. అవకాశము కలిగినప్పుడు భిన్నజాతులు కూడ కలుసుకొని, సంకరమగుచుందురు. ఈసంగతి మనస్సునం దుంచుకొన్నచో అనేకభ్రమలు దురభిమానములు తొలగిపోవును.. జనులు 'జాతి' శబ్దము నపార్థముగా నశ్రద్ధతో నుపయోగించుచు, అందుపై విపరీతమగు తరగతుల నేర్పరచుచు, 'బ్రిటిషు' జాతి 'యూరపియను' జాతి మున్నగు సంగతుల జెప్పుచుందురు. యూరపులో రమారమి అన్ని జాతులును గోధుమ, చామనచాయ, తెలుపు, మంగోలి యను, జాత్యంశముల సాంకర్యముగల మిశ్రజాతివారే.

ఇట్లు నరులు వ్యాపించుటలో నవశిలాయుగమున కొందరు మంగోలియనులు ప్రథమమున అమెరికాకు వెళ్ళిరి. వీరు బహుశః ఉత్తరమందలి బెహిరింగు జలసంధి ప్రాంతమున బ్రవేశించి, అక్కడనుండి అమెరికాలో దక్షి

ణముగా వ్యాపించియుందురు. ఉత్తరమున అచ్చటి తెల్ల దుప్పులను, దక్షిణమున కారెనుముల మందలను, గాంచిరి. దక్షిణ అమెరికా చేరునప్పటి కచ్చట భీమకాయములగు 'గ్లిప్టొడన్' అను నఖమృగములను, 'మెగథెరియం' అను వికృతాకారములు, గజతుల్యములు అగు భీకరజంతువులను జూచిరి. ఈమెగథెరియం పెద్దదైనను మందమగుటచే దానిని వీరు కడతేర్చియుందురు.

ఈ అమెరికనులలో చాలమంది సంచారశీలురై, వేటాడుచు, నవశిలాయుగపు సంస్కృతిలోనే యుండిరి; మెక్సికో యూకటన్ పెరూదేశములందు స్థిరవాసము వ్యవసాయము కలిగినవి. అందుచే పూర్వార్ధ ప్రపంచములో వలె నిచ్చటను, కీ. పూ. 1000 సంవత్సరముల క్రిందట, వ్యవసాయనాగరికత వ్యాపించినది. అంతకుపూర్వము మన పూర్వార్ధగోళమందువలె నిచ్చటగూడ, విత్తులుజల్లుడు కోతలకాలములందు నరబలి యుండెను; అయితే మనప్రాంతములందీ నరమేధాది దురాచారములు, క్రమముగా క్షీణించి, వాటిస్థానే యితరపద్ధతులువచ్చెను. అమెరికాలో మాత్ర మీనరబలులప్పుడు తగ్గుటకుబదులు హెచ్చెను; వాటికర్మకాండకూడ పెరిగినది. నాగరికులై సాంప్రదాయికులైన ఈ అమెరికనులపై గురువులు విశేషాధికారము

చలాయించుచుండిరి. ఈజాతిరాజులు సేనానులు తీవ్ర మతభావములకు శకునములకు బద్ధులైరి.

వీరిగురువులు జ్యోతిర్గణితమున జాలవివరముల సరిగా గ్రహించిరి: బ్లాబిలోనియనులకన్నను కాలనిర్ణయము వీరికెక్కువ బాగుగా తెలియును. అందు యూకటనులో విచిత్రము చాల క్లిష్టము అగు 'మయలిపి' అను వ్రాత కూడ ఉండెను. ప్రజ్ఞావంతులగువీరిగురువులు అతిక్లిష్టముగా పంచాంగపు లెక్కలజేసి యీలిపిలో వ్రాయుచుండిరని తోచును. క్రీ. త. 700 సం॥ 800 సం॥ ఆప్రాంతమున ఈ మయనాగరికత ఉచ్చదశలో యుండెను. † వీరిశిలాచిత్రణము శిల్పసామర్థ్యము మనోహరమై ఆధునికుల ముగ్ధుల చేసెను. కాని యీచిత్రవుల క్లిష్టసాంకేతికభావములు విపరీతములు, సంభ్రమకరములు; మన పూర్వార్ధగోళమందిట్టి వెక్కడనులేవు; ప్రాచీనహిందూదేశీయుల చిత్తువులకు మాత్రము వాటితో గొంతపోలికయుండును. ఎక్కడ జూచినను అల్లిబిల్లిగనల్లిన ఈకలును, చిత్రముగ మెలికలు

† ఈశిల్పకారకుడగు మయుడెవడో యెవరికిని తెలియదు. మన భారతదేశమునగూడ మయుడనుమహాప్రతిభాయుతుడగు అసురరాక్షస శిల్పియొకడుండెనని, అతడు నిర్మించిన అద్భుతభవనమందే పాండవులు రాజసూయయాగముచేసిరని, ఆభవనవైచిత్రికి రాజరాజగు దుర్యోధనుడుగూడ దిగ్భ్రమజెంది అసూయావిష్టుడయ్యెనని, భారతకథ.

వేసిన సర్పములును, వీనిలో గన్పడుచుండును. ఈమయ లిపిలోని కొన్ని శిలాశాసనములు యూరపులోని యితర లిఖితములకన్న పిచ్చిఆస్పత్రులలోని పిచ్చివారు అతిశ్రమతో గీసినవానివలె కాన్పించుచుండును. ఈ'మయ'మనస్సు మన ప్రాచ్యార్థ ప్రపంచజనుల మనస్సునకు భిన్నము; వారి భావములును వక్రముగానుండినవని తోచును. ఈపురాతనపు అమెరికనుల నాగరికత వక్రభావపూరిత మనుటకు వారు విశేష నరహత్యల జేయుట కూడ నిదర్శనము; ముఖ్యమగు మెక్సికను నాగరికతలో, నరబలి, జాతరలు, విపరీతముగ నుండెను. సాలీనా వేలకొలది మనుజుల జీవించి యుండగనే ఖండించి బలియిచ్చుచుండిరి; వారి దారుణ చర్యలచ్చటి విచిత్రగురువులకు నిత్యకృత్యములుగ నుండెను. సాంఘికసమయములందు, జాతీయోత్సవములందు గూడ, ఇట్టి ఘోరహత్య ముఖ్యచర్యగా నుండెను.

ఈసంఘమందలి సామాన్యజనుల నిత్యజీవనము ఇతరజనుల జీవనమువలెనే యుండెను. వీరి మృత్పాత్ర నిర్మాణము, నేత, రంగులుచేయుట, చాల బాగుగనేయుండినవి. వీరు మయాక్షరముల రాతిపై జెక్కుటయేగాక, చర్మములు మొదలగువానిపైన వ్రాసి, చిత్రించుచుండిరి. యూరపు అమెరికాలలోని అనేక చిత్రవస్తుశాలలలో, ఈ

నిగూఢమయలిపితోనున్న వస్తువులెన్నియో కలవు, వీటి లోని తారీఖులుతప్ప మిగిలినవన్నియు మనకు బోధపడవు. పెరూదేశమునగూడ నిట్టివ్రాత యారంభమైనది. కాని యింతలో దారములు ముడివేయుపద్ధతి రాగానే యీలిపి పోయినది; దారపుముడులచే సంగతుల తెలుపు యీ పద్ధతి కొన్ని వేలసంవత్సరముల క్రింద చీనాదేశములోగూడ నుండినది. ఈపూర్వఅమెరికనుల నాగరికతవంటి నాగరి కత మన ప్రాచ్యార్ధ ప్రపంచమందు గూడ ఇంతకన్న 3, 4 వేల యేండ్ల క్రితమే, అనగా క్రీ. పూ. 4, లేక 5 వేల సంవత్సరము లప్పుడు ఉండెను. ఇచ్చటను గుళ్లు, అందు జంతువుల జాతరలు, జ్యోతిశ్శాస్త్రజ్ఞులగు పూజారుల ప్రాబల్యమును, ఉండినవి. కాని మన పూర్వార్ధలోక మందలి నాగరికతలు మిశ్రితములై, ఒక్కొక నాగరికత వారు తక్కినవారినిబట్టి అనేకసంగతులనేర్చి వృద్ధినొందు టచే, ఆధునిక నాగరికతకలిగినది. అమెరికాలో మాత్రము వారి ఆదిమవికృతస్థితి అట్లేయుండి, ప్రత్యేకలోకముగా నుండిపోయెను. యూరపియనులమెక్సికాలోనికి వెళ్లువరకు, ఆఖండములో పెరూదేశముసంగతి మెక్సికోవారికి అసలే తెలియదు; పెరూవారి ముఖ్యాహారపదార్థమగు బంగా ళాదుంపలసంగతి మెక్సికోవా రెరుగరు. తరతరములుగా

వారట్లు జీవించుచు తమదేవతల దలచి విభ్రాంతులై, బలుల నిచ్చుచు, జీవనము గడుపుచుండిరి. మయశిల్పమున మంచి చమత్కృతి అందము కలవు.

వా రావేశముతో యుద్ధము లొనర్చుచుండిరి. అతి వృష్టి, అనావృష్టి, అంటువ్యాధులు, ఆరోగ్యస్థితి, కాల క్రమమున గలుగుచుండినవి. అచ్చట గురువు లేండ్లకొలది కిషగణితములతో పంచాంగముల గుణించుచు, యజ్ఞము లు కర్మకాండ వృద్ధిజేయుచు నుండిరి. కాని యితరవిధమగు యధార్థాభివృద్ధి యేమియు వారిలో లేకపోయెను.

---

## 15

## సుమేరియా, మిశ్రదేశము, లేఖనము.

పశ్చిమార్ధగోళము (అనగా అమెరికా)కన్న, పూర్వార్ధలోక మెక్కువవిశాలము. మరియు అందవాంతరభేదములు చాలకలవు. (అమెరికాలోని) పెరూదేశస్థితి సమీపించు నాగరికత, ఆసియాఖండములోని ఫలవంతములగు అనేకదేశములందు, ముఖ్యముగా ఈజిప్టుదేశపు నైలు నదీతీరమందు, క్రీ. పూ. ఆరేడువేల సంవత్సరముల క్రిందనే యుండినది. ఆకాలమున ఉత్తరపర్షియా, పశ్చిమతుర్కీస్థానము, దక్షిణఅరేబియా దేశము లిప్పటికన్న చాల ఫలవంతముగ నుండినవి. ఈప్రాంతములందు చాల పురాతన కాలమున జనులుండినట్లునిదర్శనములు కలవు. దక్షిణమెసపొటేమియాలోను ఈజిప్టు అనబడు మిశ్రదేశములో మాత్రము, ఇతరదేశములకన్న ముందే, నగరములు దేవాలయములు మంచిపద్ధతులతో పల్లపువ్యవసాయము, కొంత నాగరికస్థితి, ఉండినవి. ఆకాలమున యూఫ్రటీస్ టైగ్రీసు నదులు వేరువేరుగానే పారసీకసముద్రములోనికి ప్రవహించుచుండెను. ఈరెండునదుల మధ్యదేశమందు, సుమేరియనులు తమ ప్రథమనగరముల నిర్మించుకొనిరి. ఆకాలము

నిర్ణయించుట కష్టము; కాని సుమారాకాలమందే ఈ జిప్టుచరిత్ర ప్రారంభించెను.

ఈసుమేరియనులు దీర్ఘనాసికులు, గోధుమవర్ణులు; వీరిలిపి యిప్పుడు కొంత బోధపడి, వీరిభాష తెలిసినది. వీరు కంచువాడుక కనిపెట్టిరి; పచ్చియిటుకలతో ఉన్నతగోపురములతో దేవాలయముల నిర్మించిరి. వారు ప్రశస్తమగు రేవడిమట్టిపై వ్రాయుటచే, వారిశాసనాదు లిప్పటికిని భద్రముగా నిల్చియున్నవి. వారికి పశువులు, గొఱ్ఱెలు మేకలు గాడిదలు నుండినవి; కాని గుర్రములులేవు. వారు బల్లెములు చర్మపుడాలుధరించి, దృఢవ్యూహములతో పదాతులుగనే యుద్ధముచేయుచుండిరి. వారివస్త్రములు ఉన్నివి; తలకు క్షౌరము చేసుకొనుచుండిరి.

ప్రతిసుమేరియను పురమును ఒక ప్రత్యేకరాజ్యమై యుండెను. దానికి వేరే పురదేవత గురువులు నుండిరి. కాని ఒకప్పుడొక నగరపువారు తక్కినవాటిని జయించి, ఆపౌరులనుండి పన్నులు వసూలుచేయుచుండిరి. సుమేరియనుల 'ఎరక్' పురరాజ్యమొక సామ్రాజ్యముగా నుండినట్లు, 'నిప్పూరు'లోని అతిప్రాచీనశాసనమొకటి తెలుపుచున్నది; ఇదే లిఖితనిదర్శనముగల ప్రథమసామ్రాజ్యము.

ఈరాజ్యపుచక్రవర్తి పారసీక సింధుశాఖ మొదలు ఎర్ర సముద్రమువరకు పాలించెను.

ప్రప్రథమమున చిత్రముల వస్తురూపమునగీసి సంగ్రహసంజ్ఞ లిచ్చుటతో వ్రాత ఆరంభించినది. నవశిలాయుగ మున పూర్వమందే మనుష్యులు వ్రాయ మొదలిడిరి. ఇదివరలో చెప్పిన 'అజీలియను' శిలల చిత్తరువులలో, ఈ పద్ధతిసూచన కలదు; వాటిలో చాలవరకు వేటలు, దండయాత్రలు, చిత్రించిరి. ఇందు చాలవరకు నరుల విగ్రహములు పూర్తిగా లిఖింపబడుచుండెను; కాని కొన్నిటిలో లేఖకులు తల, కాళ్లు, చేతులు, వివరముగా చిత్రింపక, మనిషిఅని తెలుపుటకు ఒక నిలువుగీత దానిపై అడ్డుగ రెండు చిన్నగీతలు గీసిరి.

దీనినుండి చిత్రలిపి యేర్పడుట సులభమయ్యెను. రేవటిమట్టిలో కర్రతో వ్రాయుటచే, సుమేరియా మట్టిఅక్షరముల ఆకారము కొంతకాలముకు అసలు వస్తువుల పోలిక లేకుండ పోయినది. కాని ఈజిప్టుజనులు గోడలపైనను, కాకితముచేయు రెల్లుపైనను, చిత్రించిరి, అందు ఆవస్తువులపోలిక నిల్చియున్నది. సుమేరియాలో వ్రాతలో కర్ర గంటముల నాట్లుండుటచే, సుమేరియను వ్రాతకు 'కునిఫారం' వ్రాతలని పేరువచ్చినది.

తరువాత చిత్రాక్షరములను ఆచిత్రముల అసలు వస్తువులకేగాక, ఆమాదిరి యితరవస్తువులకుగూడ వ్రాసిరి; అంతట లేఖనపద్ధతిగూడ సులభమయ్యెను; కొన్నిచిత్రలేఖనస్థలములందిప్పటికిని అట్లు చేయుదురు. అది పిల్లలకు ప్రీతికరముగనుండును. 'శిబిర'మనుటకు డేరా, గంట, చిత్రించిరి; దానినిజూచి అంకులసంగతి గ్రహించగానే, పిల్లలకానందముకల్గును. ఈసుమేరియను భాషలో విడి అక్షరములుగాక, కొన్నిహల్లులు ఒకఅచ్చుతోకలసిపోయి ఏకాక్షరముగా భావింపబడుచు, అమెరికాఖండపు ఇండియనుభాషలవలెనున్నవి; ఈరీతిని ఆభాషలో సంగతులు వ్రాసి భావముల దెలియజేయుట సులభమయ్యెను. ఈజిప్టు వ్రాతయు ఈరీతినేవృద్ధియయ్యెను. ఇట్లు సంయుక్తాక్షరములనొకేఅక్షరముగ నెంచుభాషలుగల యితరజాతులవారు ఈచిత్రాక్షరలిపి నేర్చుకొనినపుడు, దానియందు గొన్ని అవసరమగు మార్పులజేసిరి. సుమేరియనుల 'కునిఫారం' ఈజిప్టుదేశీయుల 'హీరాగ్లిఫిక' (గురులిపి) వీనిసాంకర్యముచే, ఆధునికప్రపంచపు అక్షరమాలలేర్పడెను; చీనాదేశమున మాత్రమిప్పటికి ప్రత్యేకధ్వని కొకయక్షరముండు స్థితిరాలేదు.

మానవ సంఘాభివృద్ధికి లిపిజ్ఞానము చాలముఖ్యము. లిపిచే జనుల నిబంధనలు ఏర్పాట్లు న్యాయశాస్త్ర నియమము లిఖితములై, చిరస్థాయియైనవి. ఒక్కొక్క నగరమొక రాజ్యముగ నుండక, ఒక్కొకరాజ్యము విస్తరించి వ్యాపించుటకును, లిపిసహాయకమాయెను. అందుచే అవిచ్ఛిన్నచారిత్రకజ్ఞానము కలుగ వీలయ్యెను. గుర్వాజ్ఞయు రాజశాసనము వారిదృష్టిమేరకేగాక, దూరస్థలములకు వ్యాపించి, వారియనంతరముగూడ నిల్చుట సాధ్యమాయెను. ప్రాచీనసుమేరియాలో పాలకులు రాజవంశీయులు వర్తకులు తమముద్రలను చిత్రముగా మనోహరముగా చెక్కించుకొని, తమరేవటి పత్రములపైన ఆసీళ్లను ముద్రించుచుండిరి. ఆరువేలయేండ్లక్రిందనే, అప్పటినాగరికులలో అచ్చుపద్ధతి సమీపించెను. ఆమట్టి ఆరగానే, గట్టిపడును. ప్రాచీనమెసపొటేమియాలో చాలకాలమిట్లు ఉత్తరములు, శాసనములు, పత్రములు, జమాఖర్చులెక్కలు మొదలగునవి, గట్టిఇటుకలపైన పెంకులపైన లిఖింపబడినవి; అందుచే, ఆకాలపుసంగతుల మనము తెలిసికొనగలిగితిమి. అతిప్రాచీనకాలమందే, సుమేరియా ఈజిప్టు దేశీయులకు, కంచు, రాగి, బంగారము, వెండియు, తెలిసియుండినవి. ఇనుమప్పుడు ప్రియమగు విచిత్రపదార్థముగ నుండెను.

ఆదేశముల ప్రాచీననగరస్థుల దినచర్య లొకేరీతిగ నుండి యుండును. పశువులు, గాడిదలు, మచ్చికయై ఉండుట తప్ప, ఇతరవిషయములందు అప్పటి సామాన్యజీవనము అమెరికాలో తరువాత 3, 4 వేల యేండ్లవరకుండిన 'మయ' పురములరీతినే ఉండియుండును. శాంతపరిస్థితులుకలిగి, జనులుత్సవదినములుతప్ప తక్కినదినములందు చాల వరకు ఊడ్పులు కోతలు చేసుకొనుచుండిరి. వారికి నాణెములు లేవు; అప్పుడు వాటి అవసరమును లేదు. అప్పటి స్వల్పవ్యాపారము వినిమయము (అనగా సాటాబేరము)చే జరిగెను. కొద్ది ఆస్తిగలవారివలెగాక, చాల ఆస్తిగల రాజులు ప్రభువులుమాత్రము, తమ వ్యాపారావసరముల నిమిత్తమె వెండిబంగారు కడ్డీలను రత్నాదులను వాడుకొనుచుండిరి. అప్పటిజీవితమున గుడికి ప్రాముఖ్యముండెను; సుమేరియాలోని దేవాలయముల దీర్ఘగోపురములపై కప్పునుండి, నక్షత్రపరీక్ష చేయుచుండిరి. ఈజిప్టు ఆలయములు అంతస్తులు లేకమహాభవనములుగ నుండెడివి. సుమేరియాలో గురువే అధికారియై, ఇతరులందరికంటె ముఖ్యుడు సర్వోత్తముడుగ భావింపబడెను. ఈజిప్టుదేశమున మాత్రము గురువులకన్న రాజే అధికుడు; అతనిని దేవునిఅవతారములని భావించి, 'ఫారో' అనగా దేవప్రభువని పిల్చుచుం

డెడివారు. ఆకాలపు ప్రపంచమున నంతగామార్పులు లేవు. ఆదేశములందు వెచ్చదనము హెచ్చుచుండెను. జనులు కష్టజీవులై సంప్రదాయబద్ధులై యుండిరి. ఆదేశములోనికి తరదేశీయు లంతగావచ్చుచో చిక్కుపడుచుండిరి.

సంప్రదాయప్రకారము జీవిత నిబంధనల నేర్పరచుచు, ఆకాశమందు నక్షత్ర స్థానమునుబట్టి విత్తులజల్లు కార్తిని యాగాదుల ముహూర్తములను శకునములను గమనించి, కలలకర్థము చెప్పుచుండిరి. సామాన్యులుభూత భవిష్యత్ స్థితుల దలపెట్టక, తమ పనుల జేసికొనుచు, ప్రేమసుఖము లనుభవించి గతించుచుండిరి. కొందరు రాజులు మంచివారై యుండిరి. ఈజిప్టులో 90 సంIIలు పాలించిన 2 వ 'పెపి' అట్టివాడే. ఒక్కొకరాజు అధికారవాంఛావేశముచే, తనరాజ్యపు యువకుల ప్రక్కపుర రాజ్యములపై యుద్ధము, దోపిడులు చేయుటకు యోధులుగా పంపుచుండెను; లేక వారిచే కూలిచేయించి, మహాభవనముల కట్టించుకొనుచుండెను. 'గిజె' వద్దనున్న ఉచ్చశిఖరములగు గోరీకట్టడములు కట్టించిన 'చియోప్సు, సెరినస్, చఫ్రీన్' గార్లిట్టివారే; ఈకట్టడములన్నిటిలో పెద్దది 450 అడుగుల యెత్తుండును; అందలి రాళ్ళమొత్తపు బలువు 48, 83,000 టన్నులుండును. అందుల సామగ్రులన్నిటిని

నైలునదిద్వారా పడవలలో తెప్పించి, ముఖ్యముగా కాయకష్టము మూలముననే, ఆస్థలములందుంచి కట్టించిరి. ఒక మహాయుద్ధమువలన గలుగు శ్రమకన్న, ఈకట్టడములు గట్టుటచే నాదేశీయుల కెక్కువ శ్రమ ఆయాసము కల్గియుండును.*

* (పురాతనములగు మహాభవనములుకొన్ని మనభారతదేశమునందును నిర్మింపబడి కాలక్రమమున శిథిలములై భూమిలోకప్పబడిపోయెను. యుద్ధశ్రమవలన జనులకును దేశమునకును అపారమగు నష్టము కలుగును. కట్టడములవలన అట్టినష్టములులేకుండుటయేగాక, రాజద్రవ్యము వాటికై ప్రజలకువెచ్చింపబడి, చాలమందికి జీవనోపాధియేర్పడును.)

సుమేరియా యీజిప్టుదేశీయుల 'కునిఫారం' 'హీరాగ్లఫిక్' లిపులనుండియే,పాశ్చాత్యదేశముల ఇంగ్లీషు మొదలగు భాషలకుపయోగించు రోమను లిపి మొదలగునవేర్పడినవి. (రోమనులిపియే యూరపు, అమెరికా, ఆస్ట్రేలియా, మున్నగు ఖండములలో చాలవరకువ్యాపించియున్నది.)

మనభారతీయలిపులెట్లు వచ్చెనను సంగతి సందిగ్ధముగ నున్నది. అదియెట్లున్నను ఈ 'కునిఫారం' రోమను, ఉర్దు మొదలగు పాశ్చాత్య లిపులన్నిటిలో 26 అక్షరములే యుండగా, అరవముతప్ప మిగిలిన మన భారతీయలిపులన్నిటిలో సుమారు 46 అక్షరములున్నవి; వాటివరుసయు వేరు. వేదములందు లిపిప్రశంసలేకపోవుటకు, గురుముఖమునుండియే విద్యాభ్యాసముచేయుట వేదకాలమునుండి మనకు సంప్రదాయమగుటయే కారణము. అంతమాత్రమున, అప్పుడు మనదేశమున లిపి లేదనుటకు వీలులేదు. ఆర్యులుమొదట వ్రాతకుపయోగించిన భూర్జపత్రముల

'భూర్జ' సంబంధికశబ్దములే యూరపియను ట్యూటను భాషలో నున్న వి. గ్రంథము అను అర్థపు 'బుక్' పదను 'భూర్జ'కుసంబంధించినదే. అందుచే భారతీయార్యులు యూరపుఆర్యులు విడునప్పటికి ఆర్యులకు వ్రాతయుండెననియో భారతీయార్యులనుండియే పాశ్చాత్యులకు గ్రంథ పద్ధతి వ్యాపించెననియో సూచితమగును. క్రీ. పూ. సుమారు ఏడవ శతాబ్దమందుండిన పాణిని ముని రచించిన అష్టాధ్యాయి సూత్రముల నాటికి చాలపూర్వమే, మన 46 అక్షరములు శాస్త్రీయముగ సమర్పబడి, మనదేశమున బాగుగ అమలులోనుండినటుల పాణిని అష్టాధ్యాయి, దానికాధారమగు 'మహేశ్వరసూత్రము', వల్లనే స్పష్టము. పాణినికిపూర్వమే శాకల్యశాకటాయనాదుల వ్యాకరణములు ప్రాచ్యోదీచ్యాదుల వేరువేరుసిద్ధాంతములుగూడ నుండినవి. అప్పటికి యవనలిపికూడ నిచ్చట తెలసి, అది 'యవనానీ' అనబడినట్లు "ఇంద్రవరుణ............... యవ నమాతులాచార్యాణామానుక్." (పా. అ. 4-1-49) అను సూత్రమువలనను "యవనాల్లిప్యాం" అనువరరుచి వార్తికమువలనను స్పష్టమగుచున్నది. అప్పటికే చాలశాస్త్రములందు ఏర్పడి యుండిన అద్భుతసూత్రవాఙ్మయమునకు లిపిలేకుండుట అసంభవము. క్రీ. పూ 3 శతాబ్దపు 'అశోక' శిలాశాసనములు, మనదేశపు ఆయాప్రాంతపు వేరు వేరు లిపులలో వ్రాయబడినవి. సుమేరియాలోవలెగాక మనదేశమున మొదటినుండియు సులభముగా శిథిలమగు భూర్జపత్రములు తాటియాకులుమాత్రము వ్రాతకువాడుటచే, అంతకుపూర్వపు లిఖితగ్రంథములు నశించిపోయినవి. మనపూర్వపులిపులలో గాంధారమందు వాడుచుండిన 'ఖరోష్టి'తప్ప, తక్కినప్రాంతములందలి 'బ్రాహ్మి' లిపి యెడమవైపు నుండి కుడివైపుకే వ్రాయబడెను. ఈబ్రాహ్మిలిపి ఉత్తరశాఖనుండి గుజ్జరాతి దేవనాగరి బంగాళీ మొదలగు ఉత్తరభారతలిపులును, దక్షిణశాఖ

నుండి కన్నడము తెలుగు మొదలగునవియు ఏర్పడినవి. మొత్తముమీద ఉర్దూతప్ప మిగిలిన యిప్పటి భారతీయలిపులన్నియు, బ్రాహ్మినుండియే కలిగెను. ఓఢ్రులు, ఆంధ్రులు, కన్నడులు మొదలగువారు భూర్జపత్రముకు ఈకకలమునకు బదులు తాటాకును గంటమును వాడుటచే, మనలిపిలో అడ్డుగీతలు చాలతక్కువగను గుండ్రదనము చాలయెక్కువగను యేర్పడెనందురు. దేవనాగరి అనబడు నాగరలిపిని గుజరాతి, బంగాళీ, మొదలగు లిపులు చాలవరకును, ఆంధ్రము ఓఢ్రము మొదలగునవి కొంతవరకును, పోలియున్నవి. మరియు దేశమున మొత్తముమీద నాగరలిపనే హిందీ మహారాష్ట్రములకును చాలవరకు సంస్కృతమునకును వాడుచున్నందున దానివ్యాప్తి తక్కినవాటికన్న చాలహెచ్చు. ఉర్దూలిపి పెర్షియను భాషలిపి; మహమ్మదీయులకాలమందు వాడుకలోనికి వచ్చెను.

యూరపుఖండమున అనేకజాతులు అనేకభాషలు ఆయాదేశములందున్నను, సుమారాఖండమంతటను అమెరికాలోను, లిపి మాత్రమొక్కటే. మనదేశ మేకరాజ్యముగ ఉన్నను హిందీ బంగాళి తెలుగు అరవము కన్నడము మొదలగు ఆయాప్రాంతీయభాషలకు వేరువేరు లిపుల వాడుదురు; అందుచే మనదేశపు యితరప్రాంతీయభాషల నేర్చుకొనుటకు ఎక్కువశ్రమపడవలసివచ్చుచున్నది. అందువల్ల దేశీయులలో పరస్పరసమావేశము కాటంకము కలుగును. ఏకలిపి ఏర్పడువో ఈశ్రమ చాలతగ్గును.

## ఆదిమ సంచారులు.

క్రీ. పూ. 6 వేలు 3 వేలు ఏండ్లమధ్యను మెసొపొటేమియా ఈజిప్టుమొదలగుదేశములందు జనులు వ్యవసాయమారంభించి, పురరాజ్యములు స్థాపించిరి. నీటిపారుదల సకాలపుపంట వీలగుచోట్ల, సందిగ్ధము శ్రమయుతము అగు వేట సంచారము మాని, జనులు స్థిరజీవన మవలంబించిరి. ఆసియామైనరులోని టైగ్రిసునది పైభాగమునందు, అస్సీరియనులు పురముల నిర్మించిరి. అచ్చటను మధ్యధరా ప్రాంతమందును ఉండిన జనులు, నాగరికులైరి. ఈకాలమున భారతదేశమందును చీనాలోను అనుకూలస్థలములందు నాగరికత వ్యాపించెను. యూరపులోగూడ మత్స్యసమృద్ధిగల సరస్తీరములందు, వేటాడియు చేపలబట్టియు, జనులు జీవించిరి; కాని అచటి నేల ఇంకను కర్కశమై, గహనములచేతనో జలములేకనో, స్థిరవాసమున కయోగ్యమై యుండెను; ఋతువులు స్థిరముకాకుండెను. అందుచే నా జనులు తమ యల్పపరిజ్ఞానముతోను స్వల్పోపకరణములతోను స్థిరవాసము చేయలేకుండిరి.

అట్టిచోట్ల ఆకాలపు జనులకు, జంతువులుండుచోట్ల వేట, పచ్చికయుండుచోట్ల పశుపాలనము,శరణ్యము

లయ్యెను. మృగయావృత్తినుండి గోపాలవృత్తి క్రమము గానే వచ్చియుండును. అడవులలో పశువులను (ఆసియాలో అశ్వములను) వెంబడించు జనులు, ఆజంతువులు తమ సొత్తు అను భావము కలిగి, అందు తమవాటిని మైదానము లందు పట్టి కట్టియుంచి, వృకాదిక్రూరమృగముల బారినుండి వానిని గాపాడుచుండిరి.

ఇట్లు నదీప్రాంతములందు కృషిసంస్కృతి వ్యాపించిన ఆయాదికాలముననే, శీతలమరుభూములనుండి ఉష్ణ శాద్వలస్థలములకు, మరియొకసంచారిజాతిబయలుదేరెను. కృషీవలులకన్న సంచారులు సాధారణముగ నెక్కువదృఢ దేహులు. వారిసంతానోత్పత్తి, జనసంఖ్యయు, తక్కువగా నుండెను; వారికి స్థిరమగు గుడులులేవు; పూజారుల ప్రాబల్యములేదు; సామానులు, పరికరములు తక్కువ. అంత మాత్రమున వారిసంస్కృతి కర్షకులస్థితికన్న హీనముకాదు. స్వైరవిహారముచే వారిలోస్వేచ్ఛ ఆత్మవిశ్వాసము ప్రపంచానుభవము హెచ్చుగనుండెను. వారినాయకుని అధికారము హెచ్చుగా నుండెను; కాని వారారోగ్యవంతులగుటచే, వైద్యులప్రాబల్య ముండియుండదు.

ఈసంచారశీలురు, స్థిరవాసుల పురములకు వచ్చినను తిరుగ నితరస్థలములకు బోవుచు, చిత్రవిచిత్ర జనులజూచు

చు, ఇతరజనులతో బోరి వ్యూహములబన్ని పచ్చిక బయళ్ళ వశపరచుకొనుచుండిరి. శైలాములగుండ నిరంతరము సంచరించు ఈజనులకు క్షేత్రవాసులకన్న ఖనిజలోహా జ్ఞానమధికము; కనుక సంచారులే కంచు లోహాను తయారుచేయుట మొదట కనిపెట్టియుంపురు. లోహపు మట్టినుండి చేసిన ఇనుపపనిముట్లు మధ్యయూరపులో నాగరికులు లేనిచోట్లనే దొరికినవి.

అయితే స్థిరవాసులకు వస్త్రములు, పాత్రలు, ఇట్టినితోపయోగులగు వస్తువులు చాల ఉండెను. ఇట్లు, వ్యాపించిన యీభిన్నసంఘములమధ్య కొంతవ్యాపారము, కొంతసంఘర్షమును, తప్పదయ్యెను. ముఖ్యముగా సుమేరియాలో సమీపముందే వ్యవసాయభూములు యెడారులు సరిహద్దులో నుండుటచే, సంచారులగుంపు లాసాగుభూములప్రక్కనుదిగి చోరీ, వ్యవసాయము, (మఱియు జిప్సీ జాతి వారిప్పటికిని జేయునట్లు) ఒకప్పుడు లోహపాత్రపరిశ్రమను, జేయుచుండెడివారు.

కోళ్ళింకను మచ్చిక కానందున, వారికి పెట్టలు దొరకలేదు. ఈకోళ్లు అసలు హిందూదేశాటవులలోనుండి క్రీ. పూ. 1000 ఆప్రాంతమున మచ్చిక కానారంభించినవి. భారతీయులు లోహవస్తువులను, తోళ్ళను, అమూల్య

రత్నాదులను ఇచ్చిరి. మృగయులు బాగుచేయని తోళ్ళు దెచ్చెడివారు; వీటికి బదులుగా అద్దములు, గాజువస్తువులు, పాత్రలు, దుస్తులు మొదలగు తయారువస్తువుల నీసంచారి, జనులు గొనిపోయెడివారు.

సుమేరియా యీజిప్టులలో ఇట్లు ప్రథమనాగరికత వ్యాపించెను; ఆకాలమున, ముఖ్యముగా మూడుసంచారి జాతుల స్థలములుండెను. యూరపులోని దూరపు టడవులందు వేట పశుపాలనము చేయు అనాగరకులగు ఒక జాతి సుందరార్యులుండిరి. క్రీ. పూ. 1500 లకు పూర్వము ఈజాతినిగూర్చి అప్పటినాగరకులకు తెలియదు. తూర్పు ఆసియాలో హూణులు మంగోలియనుజాతులు అశ్వారూఢులై, వేసవిలో కొన్ని ప్రాంతములకు చాలదూరము సంచరించుచుండిరి. ఆర్యజాతికి హూణజాతికిమధ్య, అప్పటిరష్యాలోనిమురుగుస్థలములు విశాలమగుకాస్పియనుసముద్రము నుండెను. అందుచే ఈరెండుజాతులకప్పుడుసమావేశముకలిగియుండదు. అప్పటికి రష్యా చాలవరకు జలావృతమైయుండెను; సిరియా అరేబియాలలోని యెడారులు క్రమముగా నింకను నిర్జలములయ్యెను; అంతట అందలి గోధుమవర్ణులగు 'సెమిటిక్' జనులు తమ మేకలు, గొఱ్ఱెలు, గాడిదలు, పచ్చికబయళ్లుండు ప్రాంతములకు తోలుకొనిపోవుచుండిరి.

ఈసెమిటికుగొల్లలును, ఎలమైటు అనబడు దక్షిణపర్షియా లోని నీగ్రోజాతివారును, ఆదిమనాగరికజాతుల స్థలమునకు ప్రథమమున వచ్చిన సంచారిజాతులు; వీరు వ్యాపారము, దాడికూడ, చేయువచ్చిరి. చివరకు వీరినేతలు కొందరు దేశముల జయింపనారంభించిరి. క్రీ. పూ. 2750 ప్రాంతమున 'సార్గను' అను గొప్ప సెమిటికు నాయకుడొకడు సుమే రియాప్రాంతము జయించి, పారసీక సింధుశాఖ మొదలు మధ్యధరాతీరప్రాంతమువరకున్న దేశముల కన్నిటి కధికారి యాయెను. చదువు నాగరికత లేని యితనిపరివారమువా రగు 'అక్కేడియనులు' సుమేరియనుల లిపిని నేర్చుకొని, తమరాజకీయములకును, విద్యావిషయములకును, సుమేరి యనుల నియమించుకొనిరి. తరువాత రెండుశతాబ్దముల కాసామ్రాజ్యము క్షీణింప, 'ఎలమైటు' జాతివారు విజృంభిం చిరి. ఆపైన 'అమరైట్లను' వేరొక సెమిటికుజాతివారు క్రమక్రమముగా సుమేరియా కధికారులై, యూఫ్రటీసు నదీముఖమునొద్ద, అప్పటికి చిన్నపురమగు 'బ్రాబిలను'తమ రాజధానిగా జేసుకొనిరి. వారిరాజ్యము మొదటిబ్రాబిలను సామ్రాజ్య మనబడుచున్నది. క్రీ. పూ. 2100 ప్రాంత మున ఈరాజ్యమును 'హమ్మురబి' చక్రవర్తి స్థాపించి కొన్నిచట్టముల నేర్పర్చెను. ఇవియే చరిత్రలో మనకు

తెలిసియున్న మొదటిచట్టములు. నైలునదీప్రాంతపు యిరుకులోయలు మెసపొటేమియాయంత సులభముగా సంచారిజాతుల పాలబడలేదు; కాని 'హమ్మురబి' పాలనకాలమందే, యీజిప్టుగూడ సెమిటికులు జయించిరి. అందు గోపరాజులు అని అర్థమిచ్చు 'హిస్కో'ల రాజవంశమేర్పడినది. పూర్వపు ఈజిప్టురాజులకు 'ఫారో' లని పేరు గలదు. ఈహిస్కోరాజ్యము కొన్నిశతాబ్దములుండెను. ఈజాతివా రెన్నడును ఈజిప్టువారి ఆచారభాషాదులభ్యసింపలేదు. ఈజిప్టుజనులు హిస్కోవారి ననాగరికులగు విదేశీయులుగ నెంచుచు, చివరకు క్రీ. పూ. 1000 ప్రాంతమున తిరుగబడి, వారిని తమదేశమునుండి తరిమివేసిరి.

సుమేరియాలో సెమిటికుజాతివారు స్థిరులై, ఆ దేశీయులలో కలసిపోయిరి; బాబిలను సామ్రాజ్యమున సెమిటికువారి వేషభాషలే వ్యాపించెను.

— —

## మొదటిసాగరికులు.

పడవలు సాగరనౌకలు సుమారు 25 లేక 30 వేల యేండ్లక్రిందట ప్రపంచమున ప్రారంభమై యుండును. నవశిలాయుగారంభమందనకే జనులు చర్మపుతిత్తులతోనో, మొద్దుల సాయముననో తెడ్లు తిప్పుచు, నీటిపై తిరుగ మొదలిడిరి. ఈజిప్టు సుమేరియాదేశములందు గంపవలె అల్లి చర్మముకప్పుతోను చొప్పతాటితోను బిగించిన పడవలు మొదటినుండి వాడుకలో నుండెను; అట్టి పడవ లిప్పటికిని ఆదేశములందును ఐర్లండులోను, వేల్సులోను గూడ గలవు. సీలు అను మహాతిమింగలపు చర్మముతో చేసిన పడవలతో, అమెరికా ఆసియాలమధ్యనున్న బెహరింగు జలసంధిపైన, మనుజు లిప్పటికిని దాటుచున్నారు. క్రమముగా ఉపకరణములు బాగుపడి, పెద్దగుల్లదుంగలు వాడుకలోనికి వచ్చెను. తరువాత సహజముగ పడవలును, ఆపైన ఓడలును, నిర్మింపబడినవి. ప్రపంచమంతటను జలప్రళయగాథ, మధ్యధరాతలపు సముద్రవ్యాప్తిని సూచించునట్లే, 'నోవా' పడవగాథ పురాతనకాలపు నౌకానిర్మాణమునకు జ్ఞాపికఅయిన గావచ్చును.

ఈజిప్టులో పిరామిడుల కట్టుటకు పూర్వమే ఎఱ్ఱ సముద్రముపైనను, క్రీ. పూ. 7 వేల యేండ్లకే పారసీక సింధుశాఖలోను, మధ్యధరాప్రాంతమందును, నావలుండినవి. ఇవి చాలవరకు పల్లెవాండ్లనావలే. కొన్ని వ్యాపారనావలు కొన్ని యోడదొంగలవికూడ నుండెను. మొట్టమొదటి సముద్రనావికులు సహజముగ వీలైనంత వరకు దోపిడిచేయుచు, అట్లు వీలుకానిచోటనే వ్యాపారము చేయుచుండి యుండిరి.

ఈమొట్టమొదటి నావికులు స్థలమధ్యసముద్రములపైననే చరించుచుండిరి. అందొకప్పుడు గాలివీచక, తరుచు యెదురుగాలివలనను, సముద్రయానము మొదట తీరము వెంటనే జరుగుచుండెను. పెద్దపెద్దకొయ్యలు ప్రాకులుకలిగి, మహాసముద్రమునబోగల నావలు, ఇటీవల 4 శతాబ్దములక్రిందనే యేర్పడి, వాడుకలోనికి వచ్చినవి. ప్రాచీననావల తీరమువెంట లాగుచు, తుపాను పొడగట్టగనే రేవుకు చేర్చవలసియుండెను. ఈపడవలు బాగు చేయబడి, పెద్దయోడలయ్యెను. ఇంతలో యుద్ధపుబందీలు బానిసలై, ఆయోడలలో పనిచేయ మొదలిడిరి.

సిరియా, అరేబియా ప్రాంతములందు సెమిటికు సంచారిజాతివారు ప్రవేశించి, సుమేరియాను జయించి,

